# భూప్రదక్షకుడు

# భార్యకు వ్రాసిన లేఖలు

(మొదటి భాగము)

గ్రంథకర్త:

అత్యం నరసింహమూర్తి, ఎం. ఏ. (న్యాయవాది)





పబ్లిషర్స్:

కోట నాగభూషణం, బెజవాడ.

భూప్రదక్షకుడు

# భార్యకు వ్రాసిన లేఖలు

(మొదటి భాగము)

గ్రంథకర్త:

అత్యం నరసింహమూర్తి, ఎం. ఎ. (న్యూయార్కు)





పబ్లిషర్స్:

కోట నాగభూషణం, బెజవాడ.

మహారాజశ్రీ కోట నాగభూషణంగారికి

అత్యం నరసింహమూర్తి నమస్కారములు.

మీరు నాకు నేడు వ్రాసియిచ్చిన యుత్తరం ప్రకారము మీరు నాచే రచింపబడిన "భూప్రదక్షిణుడు భార్యకు వ్రాసిన లేఖలు" యొక్క మొదటి వాల్యూమును నెలలోపున పుస్తకరూపముగ నచ్చొత్తించుకొనవచ్చును. రెండవ వాల్యూముకు తరువాత 'లేఖలు' సిద్ధమగుటతోడనె దానినిగూడ మీరు నేటి మీ యుత్తరం యొక్క షరతులకు లోబడి పుస్తకరూపమున అచ్చొత్తించుకొనవచ్చును.

చిత్తగింపుడు,

(Sd) Atyam Narasimhamurty,
PALAKOL.
27-3-35.



గ్రంథకర్తగారి భార్య: గ్రంథకర్త,



ధ న స హా య కు లు,

వలివేటి రాజయ్య, నూజివీడు.

# భూప్రదక్షకుడు భార్యకువ్రాసిన లేఖలు.

అత్యం నరసింహామూర్తి ఎం. ఎ. (న్యూయార్క్)

## ౧

10—5—1932.

నా కది యెన్నటికిని మరుపురాదు. చిన్నప్పు డొకనాడు మాతండ్రిగారి వర్తకశాలలో క్యాష్ పెట్టెవద్ద గూరుచుండియుంటిని. బ్రాహ్మణ యువకుడు తన వృద్ధజనకుని చేయిబట్టుకొని మెట్లెక్కించి నావద్ద గూరుచుండబెట్టెను. ఆ వృద్ధు డొకటిరెండు శ్లోకముల నుచ్చరించి "నాయనా నైశ్వర్యము ననుభవించు మహాదశ యున్నది. నీవు కాశీరామేశ్వరముల యాత్రలును భూప్రదక్షిణమునుకూడ జరుగగలవు" అనెను. భూమిపై నేజాతియు జ్యోతిష్యమునుగాని సాముద్రికమునుగాని యెరుగదు అది భారతీయుని సొత్తు.

వారములు మాసములు సంవత్సరములు గడచెను. కాలచక్రము తిరిగి పోవుచుండెను. నా విద్యాభ్యాసము సాగుచుండెను ఒక తరగతినుండి మరియొక తరగతికి ఎక్కుచుంటిని. ఇట్లుండ నొకయేట పట్టపరీక్షయందుత్తీర్ణుడనైతిని.

బి. యె. ప్యాస్ కావలయునని యేకాని ప్యాసైచేయునదేమి యను సమస్య మనదేశపు విద్యార్థులకు తట్టదు. బి యె. ప్యాసగుటవెనుక నాభవిష్యత్తునుగూర్చి తీవ్రముగ నాలోచించుకొంటిని.

ఏదేశము రవి యస్తమింపని యఖండ బ్రిటిష్ సామ్రాజ్యము నేలు పార్లమెంటును ధిక్కరించి పోరాడి స్వాతంత్ర్యమును సంపాదించి స్వేచ్ఛాపద్ధతుల నవలంభించి అఖండైశ్వర్యమును పొందగలిగెనో ఏదేశము లోకమున కంతకును కిరసనాయిలు సప్లయిచేయునట్టియు కోటీశ్వరులలో మొదటి కోటీశ్వరుడును అయిన రాక్ఫెలరుగారికిని దినమునకు 3000

# భూప్రదక్షకుడు భార్యకువ్రాసిన లేఖలు.

అత్యం నరసింహమూర్తి ఎం. ఎ. (న్యూయార్క్)

## ౧

10—5—1932.

నా కది యెన్నటికిని మరుపురాదు. చిన్నప్పు డొకనాడు మాతండ్రి గారి వర్తకశాలలో క్యాష్ పెట్టెవద్ద గూరుచుండియుంటిని బ్రాహ్మణ యువకుడు తన వృద్ధజనకుని చేయిబట్టుకొని మెల్లెక్కించి నావద్ద గూరు చుండబెట్టెను. ఆ వృద్ధు డొకటిరెండు శ్లోకముల నుచ్చరించి "నాయనా నీ వైశ్వర్యము ననుభవించు మహాదశ ముందు రానున్నది. నీవు కాశీరామేశ్వరముల యాత్రలును భూప్రదక్షిణమునుకూడ జరుపగలవు" అనెను. భూమిపై నేజాతియు జ్యోతిష్యమునుగాని సాముద్రికమునుగాని యెఱుగదు అది భారతీయునిసొత్తు.

వారములు మాసములు సంవత్సరములు గడచెను. కాలచక్రము తిరిగి పోవుచుండెను. నా విద్యాభ్యాసము సాగుచుండెను ఒక తరగతినుండి మరియొక తరగతికి ఎక్కుచుంటిని. ఇట్లుండ నొకయేట పట్టపరీక్షయందు త్తీర్ణుడనైతిని.

• బి. యె. ప్యాసు కావలయునని యేకాని ప్యాసైచేయునదేమి యను సమస్య మనదేశపు విద్యార్థులకు తట్టదు. బి యె. ప్యాసగుటయైనుక నాభవిష్యత్తునుగూర్చి తీవ్రముగ నాలోచించుకొంటిని.

ఏదేశము రవి యస్తమింపని యఖండ బ్రిటిష్ సామ్రాజ్యము నేలు పార్లమెంటును ధిక్కరించి పోరాడి స్వాతంత్ర్యమును సంపాదించి స్వేచ్ఛాపదతుల నవలంభించి అఖండైశ్వర్యమును పొందగలిగెనో ఏదేశము లోకమునకంతకును కిరసనాయిలు సప్లయిచేయునట్టియు కోటీశ్వరులలో మొదటి కోటీశ్వరుడును అయిన రాక్షెల్లరుగారికిని దినమునకు 3000

మోటారులను తయారుచేసి తనఫ్యాక్టొరీలలో 35000 మంది పనివాండ్రను పోషించు ఫోర్డుగారికిని దామాషాయాని నెలకు రెండు నూతన కల్పనల చొప్పున యిచ్చి నవీననాగరికతను పెంచిన ఎడిసన్ మహాశాస్త్రవేత్తకును, వడ్డీవ్యాపారమున నింత వాడికలేడని ప్రఖ్యాతిగాంచిన, గొప్పగొప్ప పరిశ్రమల కల్పిచ్చినట్టి మోర్గన్‌గారికిని, నూరుకోట్ల రూపాయిలను దానముల రూపమున నిచ్చిన దానకర్ణుడు కార్నెగీగారికిని పుట్టినిల్లో, ఏది నవీనవ్యాపారపద్ధతుల నవలంబించు వణిగ్బృందములతో నలరారుచుండునో, ఎచ్చో నవీనవ్యాపారపద్ధతుల నేర్పు ఘనవిద్యాపీఠములు నెలకొల్పబడియున్నవో అట్టి అమెరికా కేగవలెనని నిశ్చయించుకొంటిని.

బర్మా, మలయా, చైనా, జపాన్, హవయి దేశములగుండా ప్రయాణమొనర్చి యునైటెడ్ స్టేట్స్ ఆఫ్ అమెరికాయొక్క పశ్చిమపు టొడ్డును జేరితిని. సాన్‌ఫ్రాన్‌సిస్కో నగరమునుండి సుమారు 2000 ల మైళ్లదూరము మోటారుపై ఆరుదినములు ప్రయాణముచేసి, నయగారా జలపాతములను మహావిచిత్రమును దర్శించి, ఫిడెల్ల్ఫియా నగరముమీదుగా న్యూయార్కు మహానగరమును ప్రవేశించితిని. అచ్చటనే విద్యాభ్యాసమును చేసి, అట్లాంటిక్ మహాసముద్రమును దాటి, ఇంగ్లాండు ఫ్రాన్సులనుచూచి, మధ్యధరాసముద్రముగుండా పోయి, ఆఫ్రికాఖండములోని ఈజిప్టును, సుడాన్‌నుదాటి అరేబియాగుండా బొంబాయిరేవును సమీపించితిని.

లోకమును ఈ రెండుకండ్లతో చూచి విజ్ఞానమును గడింపవలెననియు, అమెరికాయందలి స్వేచ్ఛావాయువుబీల్చి స్వేచ్ఛాపద్ధతుల నేర్చి స్వేచ్ఛగా పెరుగవలెననియు, అచ్చటి విద్యాపీఠములలో జేరి ఉద్దండులైన ప్రొఫెసర్లవద్ద వ్యాపారవిద్య నభ్యసింపవలెననియు, మనదేశమునుండి ఎగుమతియగు ముడిపదార్థములను, అందు ముఖ్యముగ జీడిపప్పును కొను వర్తకశిఖామణుల స్నేహమును సంపాదింత మనియు కోరికలె అమెరికా నివాసమునకును, భూప్రదక్షిణకును ముఖ్యకారణములు.

భూవలయమును చుట్టివచ్చునప్పుడును అమెరికాలో నివాస మొనర్చి నపుడును నేననేక యమూల్యవిషయముల నేర్చుకొనుచుంటిని. నా ప్రయాణములందును, నా యమెరికా ప్రవాసకాలమందును ఎప్పటికప్పుడు నేగాంచి

నది నేను వినినది నా యర్ధాంగికి ఉత్తరముల మూలమున విపులముగ దెలుపు చుండెడివాడను. ఆమెయొక్క ప్రేమ, ఘనత్యాగమే ధైర్యమె నా విదేశగమనమునకు తావిచ్చినందున కృతజ్ఞతను మనంబున నిడుకొని నా యనుభవముల నన్నిటిని విడువక వ్రాయుచుండెడివాడను. నే కని వినునది యామె కనివిని నట్లు సంతసించునట్లు వ్రాయవలెనను సంకల్పముతో వ్రాసియుంటిని. కాని నాకు ప్రయాణ తొందరలచే నొక్కొకప్పుడు తీరిక బహు తక్కువగ నుండి నందున యనేక సంగతులను ఒక్కొక యుత్తరమంతె యిముడునట్లు చేయ వలసియుండెడిది. శైలికొరకు నేను ప్రయత్నించలేదు. భావముల నైఖరిని బట్టియు హృద్వేగమును బట్టియు మాత్రమే యేదో యొక శైలి పడెడిది. నేను తెనుగును చక్కగా నేర్వనివాడనగుటచే, ఆంధ్ర మహాజనుల కొక వేళ రుచించక పోవచ్చునను సంకోచముతో భూప్రదక్షిణుడు భార్యకు వ్రాసిన లేఖలు, అను పేరున నా యుత్తరములను పత్రికాముఖమున ఇంతదనుక ప్రచురింప సాహసించలేదు.

అట్లూరుకొనుటకూడ మంచిది కాదనియు అనేక వేలరూప్యములు వెచ్చించి అనేక ప్రయాసలకోర్చి గడించిన యనుభవములను నాతోడివారి కందించుటయు, నా యాదర్శములు ఇతరులకు సహాయభూతములగుచో కానిచ్చుటయు, పరదేశములను గూర్చి తెలుసుకొనవలెనను నభిలాషను తీర్చుటయు, నావలెనే విదేశగమన మొనరింప నిచ్ఛగలవారు. ముఖ్యముగ తెలిసికొని లాభము నొందగలవిషయములను వారికి యందజేయుట నావిధ కృత్యములని నా మిత్రులు నాకు నచ్చజెప్పిరి.

"ప్రపంచ విశేషములు విన కుతూహలపడు కూపస మండూకము లగు అస్మదాదు లెందరో వినకోరిక, గలిగి యాశాభంగము నొందుచుందురు. కావున వారు శ్రమయనక. ప్రతివారమును కొన్ని విషయములు వ్యాసరూప ముగ ఆంధ్రపత్రికలోనే ప్రకటించిన నెంతో ఉపయోగముగ నుండు నని నా ప్రార్థన" యని రాజమండ్రినుండి ఆంధ్రబుక్ డిపో ప్రొప్రయిటరు మాజేటి సన్యాసయ్యగారును, "భూప్రదక్షిణుడు భార్యకు వ్రాసిన లేఖలు చాల బాగుగ నున్నవి ఆంధ్రులు వాని జదువ కుతూహలపడెదరు తప్పక మీ తెలుగు శైలి సౌజన్యముగను; తేటగను ఉన్నందున ఆంధ్రపత్రిక

సంతోషముగ నచ్చెత్తుకొనును," అని గవర్న్మెంటు ఆర్ట్సు కాలేజి ప్రొఫెసరు దామెర్ల వెంకట్రావు యం. ఎ. యల్. టి. గారును, "మీ ధైర్య సాహసములు కొనియాడదగియున్నవి. మీయుత్తరముల జదివించి చాల యానందించినాను." అని కాకినాడనుండి వైశ్య సేవాసదన స్థాపకులు నాళం రామలింగయ్యగారును, మీ యుత్తరములు చదువునంతసేపును మీ నిర్మలభావము, గురుభక్తి, మాతృప్రేమ, బంధు మర్యాద అను ప్రతిఫలించి మీ జీవితోద్దేశములను చెప్పకయే చెప్పుచు మీయందు మాబోటి వారికి గౌరవాదరణములు హెచ్చు గలిగించుటకు కారణమగుచున్నవి. అట్టి సుగుణములను నాదర్శకముగ జేసుకొని జీవితము సన్మార్గముగ గడుపుటకు తప్పక ప్రోత్సహించు నుత్తమగ్రంధముగ కూడనగును" అని ఉభయభాషా ప్రవీణ బత్తుల కామాక్షమ్మగారును, "మీ లేఖ లమూల్యములు, జ్ఞానబోధకములు నీతి నుపదేశించునవి. అజ్ఞానాంధకారమున బడి దేవుళ్ళాడెడు వారికవి సర్చిలైట్లు. నిర్భాగ్య ఆంధ్రదేశమున, జనింపక మీరలే యితర దేశమునన్నైన జనియించినచో కీట్సు, బైరన్ మొదలగు వారల లెటర్సు, డైరీలవలె మీ లేఖలు కూడ నపారప్రాముఖ్యత కరుదెంచి యుండును. మీ లేఖ లాంధ్రయోషారత్నమునకు కంఠహారమువంటివి. మీశైలి ద్రాక్షాపాకమై చదివినకొలది చదువవలయుననిపించుచున్నది. ఇదివరకెఱుంగని యెన్నియో నూతన విషయముల మీ లేఖలమూలమున దెలిసికొనగల్గితిని." యని కవి తిలక పులవర్తి కమలావతీదేవి గారును వ్రాసిరి.

ఈయుత్తరములు నాకెంతయు హెచ్చరికను కలుగజేసినవి. వీరికి నేను కృతజ్ఞుడను. ఇకముందు వారమున కొకసారి ఆంధ్రపత్రికాముఖమున భూప్రదక్షకుడు భార్యకువ్రాసిన లేఖలు అను పేరుతో వ్రాయుచుందును. ఆ లేఖలు మూలమున ఆంధ్రమహాజనుల కొక్కింతసేవ జేయగల్గినను ధన్యుడ ననుకొందును.

ప్రియమైన సత్యా! ఇదివరకు కరస్పాండెన్సు తాలూకు కాగితములు, సర్టిఫికెట్లు, మొదలగునవన్నియు సిద్ధముచేసి మద్రాసులోని అమెరికన్ కాన్సులువద్దకు గొంపోతిని. అవేమియు పనికిరావని నాడు తిరిగి మెడికల్ సర్టిఫికెటు ఐ. యం. ఎస్ ఆఫీసరువద్దనుండి కావలెనన్నాడు! ("ఆ యాఫీసరు యూరపియన్ అయిననె నేను సర్టిఫికెట్‌ను అంగీకరింతును" అని స్పష్టీకరించెను). సిన్సినాటీ విశ్వవిద్యాలయమువారు (నన్ను జేర్చుకొనుట కంగీకరించినట్లు) తనకు తెలిగ్రాం (డైరక్టుగా) యియ్యవలె నన్నాడు! నోటరీ పబ్లిక్ వద్ద నా యాస్తినిగూర్చి (నేను) వ్రాసి బ్యాంక్ వారిచేత (దానిని) యెండార్సు చేయించవలె నన్నాడు! లేనిపోని చిక్కులన్నియు పెట్టుచున్నాడు! (అట్లయిననే గాని నేనమెరికాపోవుటకు పైజాయీయుడట మనదేశమునకువచ్చుట ఏ తెల్లవానికైన అనాయాసమె) అనవసరముగ (నాచేత) బోలెడు డబ్బు తగలవేయించుచున్నాడు ఏమి చేయను? కష్టములకొ సుఖములకొ బయలుదేరినాము అని యాలోచించినాను. దిగమ్రింగవలెననుకొన్నాను. ఏమయిననుగాని చూచెదము పట్టు పట్టెదము అని నిశ్చయించుకొనినాను. జేబునిండా డబ్బువేసికొనినాను. దైవముమీద భారమువేసికొనినాను- బయలుదేరినాను- మద్రాసు నరారణ్యము- ఒకనితో నింకొకనికి సంబంధములేకుండనుండును. ఎవరు సహాయం చేసెదరు- ఎవరెవరినో పట్టినాను- తిరిగి తిరిగి మొదటి రెండుసంగతులను సాధించినాను- ఇంక నోటరీ పబ్లిక్ బ్యాంకు ఉన్నారు- కాని ఆదివారం మద్రాసు క్లోజ్- అందరును విశ్రాంతి తీసికొందురు- కాబట్టి సోమవారమే ఆపని చూడవలె- భగవత్కృప కెమరు చూడవలె-

నిన్న మధ్యాహ్నమునకె అడయారు వచ్చినాను. బెజవాడలో మీయక్కయు, బావయు చెప్పుడైన అడయారునుగూర్చియు తియాసఫీమతమునుగూర్చియు అనిబిసెంటు దొరసానినిగూర్చియు నీకు చెప్పిరనుకొందును నేను బెజవాడలో నుండగ చెంచయ్యగారు మద్రాసులో నుండినారు. వారింటికి వెళ్లగనె అన్నపూర్ణగారు నన్ను కుశలప్రశ్నలడిగి. తరువాత భోజనమునకు పిలిచిరి. మరునాడు ఉదయం 10 గంటల కక్కడకు వెళ్లితిని. అచ్చట యం. వెంకట్రావుగారని ఒక తియాసఫిస్టుకూడ ఆమెయింట నుండి

యుండెను. ఆయన చాల మంచివారు. ఆయనయు, నేనును, అన్నపూర్ణ గారును ఒక పంక్తిన భోజనముచేసినాము. అక్కడనుండగ ఆయన నన్ను అడయారుకువెళ్లి చూడవలసినదనియు ఆయన భార్య సుభద్రమ్మగారిని కలిసికొనవలసినదనియు హెచ్చరించెను.

అడయారు మదరాసుకు అతి సమీపము. కాబట్టి వీలుచూచుకొని యిచ్చటకు వచ్చినాను. అడయారు చాల విశాలముగ కొన్నివందల యెకరములతో, పచ్చికబయళ్ళతో పచ్చనిచెట్లతో నచ్చటచట కుటీరములు కలిగి చూపరుల నానందాబ్ధి నోలలాడించును. సముద్ర మతిచేరువ.దృశ్యము ఆనందకారణము. స్త్రీ పురుషులును, బాలబాలికలు స్వేచ్ఛ వాతావరణమున హాయిగనుందురు. స్వేచ్ఛయన బాధ్యత నెరుంగని సోమరి జీవనము గాదు సుమీ! వారి సాహిత్యమేమి, వారి యాదరణమేమి, వారిచూపులు, వారినడకలు, వారిమనసులు నిరాడంబరత. విశాలభావములు, నైతికప్రవర్తన, భగవద్భక్తి అన్నియు ముద్దులు గులుకుచుండును. చిన్నబాలురిచటచక్కని తరిబియతు పొందుదురు స్వాతంత్ర్యజీవనము, మంచి యలవాటులు. వారి యిండ్లను తలిదండ్రులను మరచి సుఖముగ కాలమును గడుపుచు విద్యాభ్యాసమును చేయు మన కృష్ణ యీడుబాలురను, రాంపండు యీడుబాలురను జూచినపుడు నా రామకృష్ణులుకూడ యెన్నడిట్టి వాతావరణములను కలిగిన సలములలోనికి వత్తురో, నాగరికతను పొందుదురోయని నామనస్సు పొంగెను ఇటనున్న స్త్రీలెంతభాగ్యులో! ఏమి వీరిస్వాతంత్ర్యము నాగరికత, జాగ్రత్త! పెద్దవారు కనుపించిరి. వారిని చూచినపుడెల్ల నీవే నాకు జ్ఞప్తికి వచ్చితివి;

ఇటనొక చిత్రము:-మాస్టరెవరో స్టూడెంటెవరో తేడా తెలియదు! మాస్టరుకూడ స్టూడెంట్సువలెనె కలసిమెలసి తిరుగుచుండును. కాని తాను బోధనను చేయుచునె యుండును. (అయినను మొత్తముమీద) అడయారులోని యాదర్శములకంటె మన సద్గురువువారి దయాల్బాగ్ లోని యాదర్శము ఔన్నత్యతరములై యుండును. అదియుగాక పరమపితతోడి సంబంధముచే ఏనిముషమున కపుడక్కడవారు పవిత్రులగుచుందురు- రెండవది, నిశ్శబ్దత ఇచట తక్కువ. దయాల్బాగులో ఋషివనములోవలె నిర్మలముగ నిశ్శబ్దముగ నుండును.

3

(వైజా కొరకుబడిన తిప్పలు రుచులను జయించుట.)

మద్రాసు 12—2—29:—

దైవములేడా కష్టములను గుర్తించువాడు? అమెరికకై, కౌన్సలు పెట్టుచిక్కులను తలంచుకొనుచు ఆశీర్వదింపుమని ప్రార్థించి పరుంటిని. ఇంకను తెల్లవారలేదు. మెలకువవచ్చి స్మరణధ్యానము చేయుచుంటిని. ఇంతలో తెల్లవారినది. డ్రెస్ వేసికొని వై. వి కోటయ్యగారిని తీసుకొని బయలుదేరితిని. బయలుదేరిన వేళావిశేషమేమోగాని ఒక నిముషమైన నిలకడలేక బొంగరమువలె మద్రాస్ పట్టణము తిరుగుచుంటిమి. రిక్షాలు, ట్రాములు, మోటారులు మార్చుచుంటిమి. కాలినడకకూడ యవసరమగుచుండెను. కాలుకాలిన పిల్లివలెనై తిరుగాడితిని. ఎన్నిశ్రమలు పడినను ఎంతసొమ్ము ఖర్చయినను ఫలము దక్కినది. కౌన్సలు కోరిన (హిరణ్యాక్ష వరము) లెల్ల పూర్తిచేసి, మెప్పించి. కడకు అతనివద్ద వైజాపుచ్చుకొన్నాను.

మద్రాస్కు వచ్చినదిలగాయతు నిన్నను కౌన్సలువద్ద వైజా (అనగా అమెరికాలో నడుగుపెట్టుట కనుజ్ఞ) పుచ్చుకొన్నపుడు పొందిన సంతోషమును ఎప్పుడును పొందలేదు. ఇక నేమిపని యిక్కడ? కావలసిన తోలు ట్రింకులు, హెయిర్ బ్రష్లు వగైరా కొనుక్కొని నావద్దనున్న సొమ్ములో నే రెండుమూడునందలో దగ్గరనుంచుకొని మిగిలినదంతయు బ్యాంకులో పడవేసి, రేపే మద్రాస్ వదలెదను. (బొంబాయినుండి నీ కుత్తరము వ్రాసెదను.)

ఈ పట్టణము చేరినది లగాయతు సత్రభోజనం మఠం నిద్రవలెనున్నది నాపని! ఇచ్చట నాకు చాలమంది స్నేహితులున్నారు, వారందరును ఇప్పుడు మంచి స్థితి గతులలో నున్నారు, ఒక్కొక్కరిని చూచుటకు వెళ్లియుంటిని, అందరి యిండ్లలోను భోజనములు, పిండివంటలు, వినోదములు.

గత రాత్రి కె యస్. చెట్టిగారింటికి వెళ్ళినాను. ఆయనయిల్లు బహు రమ్యముగ నున్నది. ఆయన భార్యయు చాల మంచియామె. ఆమె

నాకు భోజనసమయమున పరమాన్నమును ఒకగిన్నెలో పెట్టినది. దానిని నేను కోళంబ్ అనుకొని అన్నములో కలుపుకొని కొట్టివేయుచుంటిని. ఆమె నవ్వి, అది పరమాన్నమని చెప్పెను. నేను మరింత పరమాన్నమును తీసుకొని అట్లేవేసుకొని, తినివేసి, "పోనిలెండు. అది పులుసువలె పచ్చ రంగుగా నున్నది" అంటిని. చూచినావా, నేనేది పడితే అదే తినివేయు చున్నాను. (నాబోటి విదేశ యాత్రికుడు మొదట జయించవలసినది రుచికోటోలు!) నాకు రుచియనునది సలాము చేసిపోయినది. ఏవస్తు వేరుచి కలిగినను, దానిని ఎంతవరకుతింటే సరిపోతుందో అంత వరకు తినుట, ఊరు కొనుటయె. రుచులకొరకు నీతో నేనెంత గడబిడ చేయుచుంటినో యింటివద్ద!

వారిద్దరును జపాన్ భాషలో (బ్రహ్మ కవగాహన కాకుండ) మాట్లాడుకొంటురు! చాల ఆనందమైనది. ఆదంపతులు చాల సంవత్సరములు జపానులో నివసించిరట. చెట్టిగారి కచట స్నేహితులున్నారు, వారి కాయన పరిచయపు లేఖల నొసంగెదనని వాగ్దానము చేసెను.

## బొంబాయిదృశ్యములు

బొంబాయి, మే 17:—

వెనుక నేను అహమ్మదాబాద్ కాంగ్రెస్‌కు వెళ్ళినపుడు బొంబాయి చూచితిని. కాని యప్పటికిని యిప్పటికిని తేడాయున్నది. అప్పుడు దొరసానులకు చక్కని జుట్టుండేది. ఇప్పుడేవీధిని గాంచినను దొరసాన్లకు క్రాపింగ్ తలలే!

నిన్నరాత్రి టాకింగ్ సినీమాకు వెళ్ళితిమి. బొమ్మ కనుపించుచునె యుండును; మాటలు వినుపించుచునె యుండును. అన్నిరకముల చప్పుడులును చెవిబడును. ఒక్క జీవము లేదుగాని అప్పటికప్పుడు మనయెదుట నాటకం ఆడుచునట్లుండును. అప్పుడివి లేవు.

నిన్న తాజ్ మహల్ హోటలుకు పోయి యుంటిమి. ఇది యాగ్రాలోని తాజ్ స్వరూపమును బోలిన కొన్ని యంతస్థుల రమ్యతమసౌధము.

ఆహోటలంతయు చూచి వచ్చేసరికి మాకు కాళ్ళు లాగినవి. నేలమీద బూట్ పడితే సలము పాడైపోవునేమో యనినంత శుభ్రముగనున్నది స్ఫటిక శిలానిర్మితము. కొన్ని యంతస్థు లెక్కిన తరువాత ఇంగ్లీషుబ్యాండ్ సొంపుగా పాడుచుందురు. ఇచ్చటను ఫలహారములకు వచ్చు దొరలకు గాని దొరసానులకుగాని మఱియేలేదు. వడ్డించే బట్లరంతా సూటు బూట్లు, హేట్లు వేసుకొని వెండిసామానులతో తినుబండారములను పానీయములను వడ్డింతురు.

సముద్రములో నౌకలాంచిమీద మేము చాలమంది కలసి దూరముగా పోయి యొక పెద్దయోడ చుట్టు తిరిగినాము. ఆలాంచి సముద్రపుటలలపై సుర్రుమువలె స్వారిచేసెను. ఆ పెద్దయోడ నెక్కుటకు పెద్దపెద్ద నిచ్చెనలు కలవు. వానిని ఆ యెత్తునుండి నీటిలో కంటా క్రిందకు వేసుకొని అందుపైనుండి యెక్కుదురు. "మీరు ముందుచేయబోవు సముద్రయానమున కిది విఘ్నేశ్వరపూజ కాబోలు" ననెను మన గోగుల నారాయణరావుగారు.

నిన్నను 5 గంటలైన తరువాత కొంతసేపు ట్రాములపై విహరించితిమి మద్రాసులోవలెగాక ఇవి మేడలవలె రెండంతస్థులవి. అతి త్వరితగతిని పరుగిడును. బొంబాయిలో చాలవరకన్నియు ఆరంతస్థుల మేడలు. ట్రాములలో తిరుగుచు ఆనందపడుచు నీవును నావద్ద లేవు గదా ఇవి యన్నియును చూచుటకు అనుకొనుచుంటిని. ఆయనకుకూడ అదియె తోచినది కాబోలు, "మీరు పిన్నమ్మగారినికూడ తప్పకుండా తీసుకు వస్తారనుకొన్నాను. ఆ మెచాల తెలివైనదనిన్ని సుగుణవతియనియు మానాన్నగారు నాతోనన్నారు. అలాటివారి కివియన్నియు చూపింపవలసి యుంటుందండీ" అనిరి నారాయణరావుగారు.

సుమారు 5½ గంటలకు సర్ కవాస్జీ జహాంగీర్ పబ్లిక్ హాలుకు వెళ్ళినాము. అది మూడంతస్థులది. చక్కని ఎలక్ట్రిక్ ఫ్యానులు; మంచి ఎలక్ట్రిక్ లైట్లు ఎదురుగుండా స్టేజి. స్టేజిపైన జరుగుచున్నదందరుచూడ వచ్చును. మన మద్రాసు రాజధానిలో నేనెరుగున్నంతవరకు ఇట్టిహాలు కానము స్త్రీ పురుషులు సొంపగు వస్త్రులను ధరించి వజ్రాభరణముల నలం

కరించుకొని యాసీనులై యట జరుగుగానము నాలకించుచున్నపుడున్న నృత్యము వర్ణనాతీతము. కన్నుల పండువుగుచుండెను. స్త్రీ లెంతమో యందకత్తెలు. ఈ పార్సీ స్త్రీలకంటె సుందరమూర్తులు ఇండియాలో లేరు కాబోలు. వారికి వారి మతమందు గాఢభక్తియట. వారిది నిత్య పవిత్రమట. సౌందర్యమును నిలియుగలియుట కలియుగ వైకుంఠము కాదా!

బొంబాయి, మే 18:—

నిన్నను సుమారు 4 గంటలకు హోటలునుంచి బయలుదేరి నారాయణరావుగారును నేనును కలసి ట్రామ్‌మీద బయటకు బోతిమి. ఓడరేవు వద్ద అనేకయోడలు పడియున్నవి. మన పొలమొల్లలో కాలువ వార్ఫువద్ద పడవలెట్లుండునో అంతకంటె ఎక్కువయోడ లీరేవులో నుండును. ప్రపంచములోని గొప్పయోడరేవులలో బొంబాయి యొకటి. ఇచ్చటకు కొన్ని వేల టన్నులుగల ఓడలువచ్చును: ప్రపంచములోని అన్నిదేశముల యోడలును ఇటకు వచ్చుచుండును. ఒక్కొక్కయోడ మనయూరి చిన్న గోపురమంత యెత్తున్నదాయనిపించును. రేవు ఒడ్డున 35 అడుగులలోతట. అందుచేనవి సరాసరి ఒడ్డుకుచేరును. పైనుండి క్రిందకు పెద్దనిచ్చెనలు మేడమెట్లవలె వ్రేలాడుచుండును. రాజపుటానా అను ఓడపై నెక్కి తిరిగితిమి. దీనినిండ నెన్నో షోకైన గదులుగలవు. భోజనములు చేయుటకు పెద్దహాలులు కుర్చీలు బల్లలు అమర్చబడియున్నవి. ఇది నాలుగు అంతస్తుల మేడ. ఒక యంతస్తుపై లైఫ్‌బోట్స్ ఉన్నవి. ఓడ మునిగే కాలమందు వానిపైనెక్కి ప్రాణములను కాపాడుకొందురు. అన్ని సదుపాయములను కలిగియున్నది.

ఒకచోట సరకుల యోడొకటి కనుపించినది. దానిమీద నొక పెద్ద క్రేన్ గలదు. అది యే వైపులకు తిరుగును. అది నేలకుదిగినపుడు దానికొక గొలుసును తగిలింతురు. ఆ గొలుసును 50 లేక 53 బస్తాలుకట్టివేసి తగిలించెదరు. ఆ బరువునెత్తుకొని ఆక్రేను లేచి, ఓడలో నెక్కడపడవేయవలెనో అక్కడపడవేయును.

ఓడలరేవునుండి రైలుస్టేషనుకు వచ్చినాము. ఇక్కడ రాక్షసిబొగ్గు అవసరం లేకుండ విద్యుచ్ఛక్తివలన రైలును నడపుచున్నారు. అతివేగమున బోవును. కొంతదూర మీ రైలునులలో ప్రయాణము చేసినాము.

## భూప్రదక్షిణుడు భార్యకు వ్రాసిన లేఖలు.

కొంతసేపటికి రయిలుదిగి మలబారు హిల్ కు బోయినాము. ఈకొండ బొంబాయిలోని యొకభాగము. అన్నిభాగములకంటె నెక్కుడు అందమైనది. నున్నని తారురోడ్లమీద కొండకుబోవు కారులకు లెక్కలేదు. రోడ్డుయొక్క ఈ పెడనుంచి యాపెడకు బోవలెనన్న అర్ధమపక్షమయి మనిముషములైన వేచియుండవలెను. లేనిచో ఏకారు మీదపడునోయను భయమే. ఆకారులలో పార్శీలును, గుజరాతీలును, ఇంగ్లీషువారును గంధర్వులవలె ఆకొండపై చల్లగాలిలో విహరింతురు. కొండపై దివ్యభవనములు లెక్కకు మీరియున్నవి. ఒక్కొక్కభవనమున కెన్ని లక్షలు ఖర్చుపెట్టి యుందురో! మలబారు కొండపై ప్రకృతి తన యత్యంత రామణీయక రూపమును దాల్చినది. విశాలమైన పచ్చికబయళ్లు, పొదరిండ్లు, ఘనవృక్షములు, రంగురంగుల పామలును కలవు అచ్చటచట బెంచీలమర్పబడి, సముద్రముకేసి యొకసారియు. ప్రకృతిమాత సౌందర్యముకేసి యొకసారియు చూచుమందు యువకులచే నలంకరింపబడియుండెను!

ఆదినమె దయాల్బాగులో హోళిజరిపిరి. అప్పటి కోలాహలమును, ఆనందమును గాంచియేతీరవలెను. సద్గురువువారు అందరికిని స్వహస్తముతో కుంకుమబొట్టును పెట్టినారు.

దర్బారులోనుండగా నాసంగతి సెక్రిటరీగారికి అవతారంగారు చీటిద్వారా తెలిపినారు. "ఒక మద్రాసి అమెరికా వెళ్ళుచున్నారట. వారిని తమకు పరిచయము చేయుచున్నాను"అని హుజూరువారితో సెక్రటరీ గారు చెప్పిరి. అంతట యీక్రింది సంభాషణ హుజూరువారికిని నాకును మధ్య ఇంగ్లీషున జరిగెను.

హుజూరు—ఎవరా మద్రాసీ అమెరికా వెళ్ళునది?

నేను—చిత్తము, నేనండి.

హుజూరు—మీ దేయూరు?

నేను—పాలకొల్లు, భీమవరమునకు 14 మైళ్ళు.

హుజూరు—పాలకొల్లు మాకు తెలియును. అచ్చట నెంతమంది సత్సంగులున్నారు?

నేను—సత్సంగము మాతోనే అచ్చట ప్రారంభమైనది. గతవత్సరమున నేనును నాభార్యయువచ్చి తమవద్ద ఉపదేశమును పొందినాము. అచ్చట ఇంకా సత్సంగులుకలరు. మా అమ్మ (అని నేను తక్కిన సత్సంగులను చెప్పుచుండగా నింకొకప్రశ్న వేసినారు)

హుజూరు—నీవీదేశమున నేమిచదివితివి ?

నేను—ఇచ్చట మద్రాస్ క్రిష్టియను కాలేజి గ్రాడ్యుయేటును.

హుజూరు—అట నెంతకాలముందువు? ఏమిచేసెదవు ?

నేను—రెండుసంవత్సరములకంటె తక్కువగాకుండ నుండదలంచితిని. మొదటి సంవత్సరము యం. యే. కును, తరువాత వ్యాపారవిద్యయును చదివెదను.

హుజూరు—ఏ విశ్వవిద్యాలయమందు ?

నేను—చిన్ననాటివారు సీటు యిచ్చినారు. కాని న్యూయార్కు విశ్వవిద్యాలయములో సీటుకొరకు గట్టిగా ప్రయత్నించి సాధ్యపడినచో న్యూయార్కు నగరముననే యుందును.

హుజూరు—నీకు జయమగుగాక! (We wish you good luck) మేమును అమెరికా వెళ్ళవలెననుకొనుచున్నాము! నీవచ్చుటకుబోయి ఒక సత్సంగమును స్థాపించునెడల మేము రావచ్చును. ఈ సంవత్సరం మద్రాస్ వెళ్ళవలెననుకొనుచున్నాము. వచ్చే సంవత్సరం అమెరికా వెళ్ళవలెనను కొందుమేమో!

నేను—చిత్తము చిత్తము ధన్యుడనైతి (ననుకొనుచు) తమరు యిచ్ఛగించినయెడల అమెరికాలో అభేజరుగును. ఈ సంవత్సరము తమ రాకకు ఆంధ్రులు ఎదురుచూచుచున్నారు.

హుజూరు—మేమును వారిని చూచుటకు ఆతురపడుచున్నాము. నీ వమెరికా వెళ్ళునపుడు "దయాల్బాగ్" అను పుస్తకమును గొంపొమ్ము. అది యవసరము. మీ తండ్రిగారి కేమిపని?

నేను—మాతండ్రిగారు స్వర్గస్థులైరి.

హుజూరు—మీ కుటుంబములో నేమిపని?

నేను—ఆదినుండియు వర్తకులము.

హుజూరు—ఏమి వర్తకము?

నేను—కొన్నాళ్ళు ధాన్యము. ఇప్పుడు నూనెకాయదినుసులు, నువ్వులు వగయిరా!

హుజూరు—అమెరికా వెళ్ళువారు నిజముగ నదృష్టవంతులు.

నేను—అమెరికాలో సత్సంగ్ సోదరు లెవరెవరున్నారు?

హుజూరు— "ది ఓరియంట్" అను పత్రిక కధిపతి న్యూయార్కులో నున్నాడు. అతడు సత్సంగియొక్క కుమారుడు. అతని పేరు గోవిల్ అని జ్ఞాపకము. అతని యడ్రస్ తీసుకొనుము. నీవు మంచి స్నేహముగ

నాతడు కల్పింపగలడు. ఇంకొక గొప్పవాడు కలడు అతడు సత్సంగి కాక పోయినను, సత్సంగపక్షపాతి. అతని పేరు మోర్గాంతూ.

21 వ తేదీకి మార్చి 21 వ తేదీ సరిగా 30 దినములు నెలరోజులయి నది ఇంటివద్దనుండి బయలుదేరి ఇంకను నా ప్రయాణమేమగునో యన్న సందేహమె. హుజూరువారితో నేను చెప్పియె తీరవలెనని నీవు పట్టుపట్టి తివి. ప్రయాణం వలదందురేమో. "ఈ సందేహములు నన్ను రాత్రిం బవళ్ళు బాధించినవి. కాని పరమపితయొక్క దయ నాపై పూర్ణముగనున్న దని హుజూరువారి సలహావలనను ఆశీర్వాదమువలనను తెలిసికొని అత్యా నందము నొందితిని. నే నెచ్చటకు వెళ్లినను హుజూరువారి యాశీర్వచనమె నన్ను జయముగాంచునట్లు చేయగలదు.

ముజఫర్పూరు, మార్చి 31:—

ఇప్పుడు మధ్యాహ్నము 3 గంటలు దాటినది. రేపీవేళకు ట్రెయిన్ లో పాట్నా ప్రాంతములకు చేరుకొనుచుందుము. కలకత్తా యెల్లుండ్లి యెన్నిగంటలకు చేరుకొందుమో యింకను తెలుసుకొనలేదు అట నెన్నా ళ్ళుండునదియు యిప్పుడు చెప్పలేను. అది నాయోడనుబట్టి నిర్ణయించవలసి యుండును. మల్లిక్ వీధిలోని తాతబావగారి సప్లయిదార్లు యింటివద్ద బసచేసెదను.

నేనును అచ్చటకు జేరుకొనుసరికి మీవద్దనుండి టెలిగ్రామ్ వచ్చి యుండునని తలంతును. మీ టెలిగ్రామ్ సకాలమునకు రానియెడల కొలది దినములు వేచి నిరాశజేసుకొని (నీవు నన్ను తిరిగి కడసారి కలసికొనలేనుగదా యను కష్టముతో) సముద్రయానమునకు గడంగెదను.

నేటి యవకాశము చాల గొప్పది. మొన్నను రెండవయుపదేశ మును బొందితిని. నేడప్పుడే భండారాను జూచుభాగ్యము లభించెను. ఉదయకాల సత్సంగమునకు అంతయు జక్కగ నలంకరింపబడెను. గురు వుగారి సింహాసనము తళతళ మెరయుచుండెను. సత్యముగ సత్సంగమైన తరువాత సద్గురువువారు కండ్లుమూసికొని ధ్యానించి ప్రార్థనచేసి లడ్డూలను ఒక్కొక్కరికిని యిచ్చెదరు. అన్ని వేలమందికి ప్రసాదమును స్వహస్త

ముతో నిచ్చుటయన నెంతకాలముపట్టునో యూహింపుము. తరువాత మామూలుగనే దర్బారులో గూర్చుండి యది ముగించిన వెనుక తమశిష్యుల సహపంక్తిని తాము సింహాసనముపై గూర్చుండి భోజనము జేతురు. వేల కొలదిగా యీ ముజఫర్పూరు భండారాకు వచ్చిన సత్సంగులందరును పంక్తులు తీర్చి అనేకవిధములగు పిండివంటల నారగింతురు. ప్రసాదము స్వహస్తముతో నిచ్చుటయు సహపంక్తిని భుజించుటయు గొప్ప యానందహేతువులు. సత్సంగు లందరును ప్రతి నిముషమునను ఆనందమున మునిగి తేలుచు రాధాస్వామీ నామమును పదేపదే యుచ్చరించుచున్నారు. ఇదియే భండారా. దీనిని గాంచుభాగ్యము నాకబ్బినందున ప్రభువుకు కృతజ్ఞుడను.

X

అంగోరా పాగయోడ,

14-4-29, రాత్రి $8\frac{1}{2}$ గంటలకు.

కలకత్తాలో ఔట్రాంఘాట్ వద్ద మనకు సంభవించిన వియోగము ముందుగ అనుకొనినదె. అయినను దుఃఖభాజనమయ్యెను. అవును, దంపతుల వియోగ మెన్నడైన సుఖకరమగునా ?

పూర్వము దేవతులును రాక్షసులును సముద్రమథనము చేసినారట. అమృతముకొరకు కష్టపడుచున్న ఆ దేవదానవులకు మొదట హాలాహలము (అనగా కాలకూటవిషము) లభించినదట! ఇంకను పట్టుదలతో పని చేయ్యుచుండగా బడబాగ్ని దొరికినదట. కాని వారు మనోధైర్యమును వీడకుండ కష్టించిరి. చివరకు వారి కమృతము దొరకెను. నాకును మొట్టమొదట హాలాహల సదృశంబగు వియోగబాధ కలుగుచున్నది. అంతటితో మథనమును వీడుదునా ! నా సంకల్పమీడేరువరకు కంఠమున ప్రాణముతో యుండుచో వదలను వదలజాలను. ప్రయత్నించుటయె నాపని. ఫలితము రక్షకుని చేతులలో నున్నది. సర్వరక్షకుడు నామథనానంతరము అమృతమొసంగకుండునా ? సద్గురువాక్య మెన్నడైన రిక్తవోవునా ? (I wish you good luck!) నీ వదృష్టవంతుడగుదువు గాకయని సద్గురువువారు నాయుదంతమునంతయు వినినమీదట ఆశీర్వదించలేదా!

ఓడ కదలిపోవుచుండెను. నేను మిమ్ములనందరిని చూచుచునేయుంటిని. మీకును నాకును దూరమధికమగుచుండెను. శరీరములు దూరమైన కొలదియు మనస్సులు దగ్గరయగుచుండెను. చాలదూరము వెళ్ళువరకు నీకేసిచూచుచు డెక్ మీద నిలబడితిని. అంతిదూరము నాకు చూపు ఆనుచుండెను. కొన్ని నిమిషములు గడచుసరికి మంచుదట్టముగ పట్టినపుడు పొలములో నిలబడిన మనుష్యులవలె అస్పష్టముగ గనిపించినారు. అటులనె నేనును మీకు కనిపించియుందును. ఇంకను రవ్వంతసేపు దృష్టి ఆనునేమో ఇంతలో నల్లగా పెద్ద దెయ్యమువలెనె అడ్డమువచ్చినదా యోడ ఎక్కడనుండియో. ఇంకను చూపున కొశలేదు. మెల్లగా నాకేబిన్ (అనగా గది) లోనికి నడచినాను. చూపులకు దూరమైన నా సత్యవతీదేవి నా మనోవీధిని స్పష్టముగ ప్రత్యక్షమయ్యెను. మనిషిని విడచి నీడను పట్టుకొంటినిగదా? యని తెలివికలిగెను. విచారసముద్రమున మునిగిపోతిని. అధైర్యము జెందితిని. ఒంటరిగా నుండినవారి కధైర్యముగాక మరేమి? కాని ప్రియసఖీ సత్సంగి యెన్నడును చిరకాలము ధైర్యమున నుంపబడును. నాకు సహాయముగ నాకత్యంత సమీపమున పరమపితయొక్క ఉనికి స్ఫురణకువచ్చి ధైర్యము నవలంబించి హాయిజెందితిని.

గతరాత్రి చాలవరకు నిద్రలేకుంటచే, నాబర్తు (అనగా పక్క) పైపరుండి ఒడలు తెలియక ఒంటిగంటన్నరవరకు నిద్రించితిని. అప్పుడైనను లేవకుండయుందును. మాకేబిన్‌బోయ్ (బోయ్అంటే కుర్రవాడను కొందువేమో, నలభయ్యేండ్లవాడు అయినను బోయ్ అనియే పిలుతురు. సేవకుడన్నమాట.) "సార్, టిఫిన్‌టయిమ్, బెల్ అయినది; డైనింగ్ హాలులోకి రండి సార్" అని లేపి వెళ్ళినాడు. నేనును చాల ఆకలిగొనియుంటిని. వెంటనే మాకేబిన్‌లోని బేసినుతెరచి పైపులోని నీరుకొంత దానిలో వదలిపెట్టి ఆ దగ్గరనేయున్న సోపుకేసునుండి సోప్‌తీసుకొని మొగము కడుక్కొని వ్రేలాడుచున్న నేవ్‌కిన్‌తో తుడుచుకొని, అటనేయున్న పెద్దఅద్దములో జుట్టు సరిజేసుకొని సూట్ వేసికొని, వందలకొలది కుర్చీలు, కొన్ని చక్కని మేజాలును అమర్చబడియుండిన ఆచక్కని భోజనాల చావడిలోనికిబోతిని. వెంటనే యొక బట్లరువచ్చి నాతో మాటాడెను. నాకు మాంసము, గ్రుడ్లు, చేపలు, మద్యము తగలని ఆహారము

నోసఖ్యగుమని యడిగితిని. మీకు శాకాహారియా యని నన్నడిగెను. "శుద్ధశాకాహారి" అంటిని ఒక పింగాణీపళ్ళెముతో అన్నమును, ఒక పింగాణీపళ్ళెముతో పులుసో కూరో అదియు, కొంచెము పచ్చడో ఊరుగాయో అదియు ఇచ్చి, కత్తి, ఫోర్కు, గరిటె దగ్గరనుంచి మంచుగడ్డ యుంచబడిన యొక గ్లాసుతో నీళ్ళ నొసంగెను. కత్తులతోను కఠారులతోను నాకు భోజనమలవాటు ఇదివరలో లేదు. కాని యిప్పుడు తప్పదు. అక్కడ తినుచున్న దొరలను దొరసానులను చూచుచు కూర్చుంటిని, (నేను చూచినట్లు మనకు వారికి తెలియకుండునట్లని కూర్చుంటిని.) అదేమి, బ్రహ్మవిద్య కనుకనా? కొద్దినిముషములలో నేనును వారివలెను ఫోర్కుతో ఊరుగాయను గుచ్చి, నోటికందించుకొని తినివేయుచుంటిని. నాకియ్యబడిన కూరముక్కలలో పెద్దవాటిని కత్తితో అన్నమును పులుసును కలుపుకొని తినుచుంటిని. మీకింక నేమైన కావలెనాయని మధ్యమధ్య బట్లరు నన్నడుగుచుండెను. ఆపులుసును నేననుమానించి, ఇందు మాంససంబంధమేమియు లేదుగదా యంటిని. లేదనినాడు, ఉల్లికోళ్ళ ముక్కలువలె నున్నవి. అది యేమివస్తువో తెలియదు. బంగాళాదుంప కోసుపువ్వు దానిలో గుర్తించినాను. ఆపచ్చడి యెంత బాగున్నదనుకొన్నావు? అందులో తేనెవేసినాడనుకొన్నాను. మామిడికాయముక్కలు కొబ్బరనుకొన్నాను. కాని కొంచెము కారముగకూడ నుండెను. తింటుండగా మంచిరుచిగా నుండెను. తిని, తిని అది యేమోకాదు. ఒకరకమైన అల్లం మురబ్బాయని చివరకు నిర్ధారణ చేయగలిగితిని నా భోజన మీరకముది!

తరువాత డెక్ మీద చల్లగాలిలో తిరుగాడి తిరుగాడి, డెక్ పై నుంపబడిన యొకవాలుకుర్చిపై కూర్చుంటిని. అ ప్రక్కనున్న కుర్చీపై నొక పెద్దమనిషి కూర్చుండియుండెను. ఆయనకు నాతో మాటాడవలెనని బుద్ధి పుట్టెనదనుకొంటాను. తనకుర్చీని నా దగ్గరకు మెల్లగా లాగుకొని యేమో మెల్లగా అనుచుండెను. బెగ్ యువర్ పార్డన్ (అనగా మళ్ళీచెప్పండి) అన్నాను. "ప్రయాణం చాల సంతోషదాయకముగ నున్నది కాదూ?" అవునన్నాను. కాలమానమునుగూర్చి యొక నిముషము మాటాడెను. ఆయన నా పేరడిగినాడు. తరువాత నామతము, కులము, వృత్తి, భార్యాబిడ్డలు, తల్లిదండ్రులు అన్ని విషయములమీద ప్రశ్నించెను. ఇక నాటరన్ వచ్చెను.

ఆయన పేరడిగినాను. రీన్ అన్నాడు. అది యూరోపియన్ పేరులాగున ఉన్నదేయన్నాను.'' అవును యూరోపియన్ ఏమో నేననుకొని ఓడవాళ్ళు నన్ను సెపరేట్ బెర్తులు కావలెనా యని అడిగినారు! నేను మహమ్మదీయుడను. నేను పావుశతాబ్దమునుండి బర్మాలోనె ఉంటున్నాను.'' అన్నాడు. ''బర్మావాండ్లు ఈ రోజులలో ఇండియన్ సామ్రాజ్యమునుండి విడిపోవుటకు ప్రయత్నించుచున్నారు. ఇండియన్‌లు ప్రతి ఆఫీసులోను వాళ్ళకంటె యెక్కువమంది ఉన్నమాట వాస్తవమే వారు ఇండియాసంబంధమును వదలుకొనునెడల ఇంగ్లీషువారు బర్మాను కోలనీ చేస్తారు. ఇప్పుడున్నంతమందియైనను బర్మనులు మంచిపనులలో ఏ ఆఫీసులోను ఉండరు. తెలివితక్కువవాండ్రు!'' అన్నాడు. బర్మాలోనివాళ్ళ చిత్రమైన అలవాటులగూర్చి ఏదైనచెప్పుమని అడిగినాను. ''మీరేదైనా కొత్తవూరు వెళ్ళినప్పుడు అక్కడవారు మన దేయూరండీ. మనబంధువులెవరు, మేనమామలెవరు, ఏమివృత్తి మొదలుగాగల ప్రశ్నలు వేస్తారు బర్మాలోఅట్లుగాదు. ఏదైనా కొత్తఊరువెళ్ళగానే మీకు పెళ్ళైమున్నదా అని మొదట అడిగెదరు. లేదనిచెప్పగనే అట్లాగైతే మీకొక మంచియువతిని పెళ్ళిచేస్తాము. కావాలా ? అందరుకావలెనని చెప్పగనే వారు యువతికొరకు ఆలోచనలసాగింతురు. చక్కగా పిండివంటలతో మేపుదురు. చాల మర్యాదలగావింతురు. పెండ్లిఅయినది, పెండ్లామున్నది అని చెప్పితిరా, మీకొరకు మర్యాదలు చేయువారెవరును ఉండరు'' అనినాడు. చైనావారిలోని స్త్రీలసంగతి యెట్టిదని అడిగినాను. ''ప్రపంచమునగల ఏజాతి పడుపుకత్తెయైనను ఏజాతి పురుషునైనను వప్పుకొనును, సొమ్ముయిచ్చుకొనిన చాలును. కాని చైనాపడుపుకత్తె మాత్రము చైనాపురుషునితక్క ఎంత ధన మిచ్చినను ఇతరుల నొల్లదు చూచితిరా, వారి జాత్యభిమానము అన్నాడు. జపాన్ యువతులు కొందరు బర్మాలో పడుపువృత్తి నవలంభించుచుండిరట. వారితో రీన్‌గారు ప్రసంగించినారట. మా జపాన్ దేశములో మాతలిదండ్రులు ప్రస్తుతమున బహుకష్టదశయందున్నారు. వారికి ధన మత్యావసరము. అందుచే ఈ వృత్తిచే ధన మార్జించి మేము వారికి సాయపడుదుము. మాకష్టము గట్టెక్కిన వెనుక మా స్వదేశమునకుబోయి హాయిగ పెండ్లిచేసుకొని కాలమును గడుపుదుము అనినారట. ఈ వృత్తి నవలంబించి

యుండిన మిమ్మెవరు వరించి పెండ్లి చేసికొందురు? అని యడుగగా, గొప్ప గొప్ప కుటుంబములలోనివారె మమ్ము పెండ్లిచేసికొందురు. మాదేశమున తలిదండ్రుల నిమిత్తము సొమ్ము గడించుటకు పడుపువృత్తి నవలంబించి నను చాల గౌరవమే యనినారట. పాతివ్రత్యముల హిందూదేశమే గొప్ప దంటిని.

రీన్‌గారు నన్ను, ఈయోడలోని ప్రయాణముచేయుచున్న మౌలానా గారికి పాదాభివందనము చేసితిని. ఆయన నాచేయిపట్టుకొని ప్రక్కనున్న బెంచిపై గూర్చుండబెట్టి బాబా, మీదేయూరు అన్నారు. కాకినాడ కనతి దూరమున నున్న పాలకొల్లు అన్నాను. అటులనా, పాపము ఆంధ్రులు చాల సంవత్సరములకు కాంగ్రెస్‌ను తమదేశములో జరిపినారు. నే నప్పుడు కాంగ్రెస్ ప్రెసిడెంటుగానుండి ఐకమత్యము కొరకు పాటుపడితిని. ఐకమత్యము సిద్ధించినది ఇప్పుడు చూడండి అందరు నాయకులు ఒకటిగ లేరు. అవునుగాని, నేను మీ మొదటి ప్రెసిడెంటును. మన దేశమునకు స్వాతంత్ర్యము వచ్చినతరువాత నేను ఆంధ్రరాష్ట్రమునకు మొదటి గవర్నరు నగుదును అని నవ్వినారు. నా అమెరికా ప్రయాణమును గూర్చి కొన్ని ప్రశ్నలడిగెను. మంచిది మీరు వర్తకవిద్య నభ్యసింప బోవుచున్నారా, ఆవిధముగ దేశసేవ చేయుటయు మంచిదే. ఏదేశమందైనను మీకే భోగట్టా కావలసివచ్చినను పోలీసువారి నడిగినయెడల చక్కగ తెలియగలదు. నే నింగ్లాండులోనున్నపుడు వారి సహాయమువలన మంచి దర్జీవాని కొట్టు మంచి ధోబీస్థలము, మంచి మంగలిషాపు, ఎక్కడెక్కడో తెలిసికొనుచుండు వాడన్ను. ప్రపంచములో నేదేశము పోలీసువారైనను మనకు మంచి త్రోవ చూపుదురు. కాని ఇండియాలోని పోలీసువారు మనకు పెడత్రోవ చూపుదురు. అని నవ్వెను. రాధాస్వామి మతమునుగూర్చియు, దయాల్బాగ్‌ను గూర్చియు, నే నాయనకుచెప్పి "వీలుచేసికొని ఎప్పుడైనను ఆగ్రాలోని దయాల్బాగ్‌కు వెళ్ళిరండి" అనినాను. "అక్కడ ముక్కుమూసుకొని కేవలము కూర్చుండి తపస్సు చేసుకొందురా? అట్లయినచో నాకు అట్టిదానియందు నమ్మకముండదు. అది ఒంటెత్తు తనమందును. ప్రజలకు నిరంతరము ఉపకారమును చేయుటకే మనము ప్రయత్నించుచుండవలెను. అందులకే ప్రార్థనలు జేయవలెను. నే నందులకే ప్రార్థించుచుందును. నామనస్సు

నావశములోనికి తెచ్చుకొనుటకు ప్రారంభించుచుందును. ఒకప్పుడు సెల్ఫ్ కంట్రోల్ కొరకు ఉపవాసముకూడ చేయుచుందును.'' అనెను! యోగాభ్యాసమువలన ఎక్కువ ఆత్మవశీకరణశక్తిని గడింపవచ్చును. అట్లుచేసి పూర్వపు ఋషులు హిందూదేశమునకు గొప్ప మార్గదర్శకులైరి. వారిది ముక్కుమూసికొనినను పంట్రెత్తుతనము'' అని నేనేమేమో చెప్పుచుండగా నెవరో వారు కొందరు తమమిత్రుని మౌలానాగారికి పరిచయము చేయుటకు వచ్చి నిలబడిరి. నేనటనుండి వెళ్లిపోయినాను "హిందూదేశమునకు ఖద్దరెంతయు తగియున్నది హిందూదేశమునిండ రయితులుగలరు. వారు పేదవారు పంటల అనంతరము తిరిగి భూమిని దున్నుకాలము వచ్చువరకు వారు వడుకుచుండినయెడల చాల లాభమును పొందుదురు. కడుపునిండ అన్నమును, కట్టుటకు బట్టయు వారికి లభ్యమగును''అని మౌలానాగారు నాతో చెప్పెను.

70 నంబరు బెర్తులోనున్న నాస్జిగారు నాకు పరిచయమైనారు. కొన్ని మిఠాయిలను ఒక పింగాణీపళ్ళెములో పెట్టి నా బెర్తులోపెట్టితిని. యెట్లావున్నవో నాకు చెప్పండి'' అన్నారు. నేను వాటిని ముట్టుకొననే లేదు. బట్లరు వాటిని తెచ్చిపెట్టినాడేమోననుకొని నాకేబిన్‌లోని మహమ్మదాలీగారి స్నేహితులు ఆజద్‌సొభానీగారు తినివేయుటారంభించెను. తిననీమని నేను ఊరుకొనినాను. ఇంతలో బట్లరు కాఫీ తీసుకువచ్చినాడు. ''ఓడలో మంచి మిఠాయి తయారుచేశారే'' అన్నారు. సొభానీగారు ''మరె మీకోసము, తయారుచేశారు రమ్మన్నారు'' ఈ మిఠాయంతా మూర్తిగారిదన్నాడు ఈసంగతి మౌలానాగారికి ఎట్లో తెలిసినది. నేను ప్రొద్దున నే డెక్ మీద నడచుచుండగా మౌలానాగారు నాచేయిపట్టుకొని ఈకథంతా చెప్పి నవ్వనారంభించెను. "చూచారా, మంచి తినుబండములు లభించినపుడు మౌల్వీలకు ప్రపంచజ్ఞానము పోతుంది'' అన్నారు!

ఈ యోడలోనే గుజరాతీవర్తకులు కపాడియాగారు భార్యాసమేతులై ప్రయాణము చేయుచున్నారు. వారికి బొంబాయిలోను, పారిస్, బర్మాలోను రవ్వలు, ముత్యములు వ్యాపారము గలదు. ఆయన చాల మంచివారు. నేను వర్తకవిద్య నభ్యసింపబోవుట కమెరికా వెళ్లుచున్నానని

మొరింగి అమెరికాలోని వారి స్నేహితులను గుజరాతీ వర్తకులును అయిన దావీగారికి పరిచయపు లేఖ నిచ్చినారు.

ఈ యోడలోని డాక్టరు నాకు స్నేహితుడైనాడు. నేను కనుబడినపుడెల్ల మతమునుగూర్చి మాటాడును. కాని నేనుచెప్పిన ప్రతివిషయమును ఖండించెను. ప్రపంచములో యోగబలమునందు ఆయనకంటె తక్కువ నమ్మకము గలవారులేరు నేను యోగాభ్యాసమునుగూర్చి మాటాడినపుడెల్ల ఆయననవ్వును. అన్ని మతములను హేళనచేయును. కాని స్నేహపాత్రుడు. "మిష్టరు మూర్తి మీరు చెప్పిన మతమునుగూర్చి గడ్డిపరకంత గౌరవము నాకు లేకపోయినను మీయందుమట్టుకు నాకు ఆప్యాయము దినదినాభివృద్ధి నొందుచున్నవి. యేమోగాని" అన్నాడు.

తెల్లవారేసరికి రంగూన్ చేరుదును. ఇప్పటికి ఆరోగ్యముగాను కులాసాగాను ఉన్నాను. స్నానంయెట్లాగా అనుకొన్నానుకాని స్నానాలగదులు ఇచ్చటివి చాల బాగున్నవి. అందు సబ్బు, తుర్కీతువాలు, పెద్దదద్దము కోటుస్టాండువగైరా అన్నియు సమర్చియుండును. ఒక పెద్ద తెల్ల తొట్టిలోనికి వేడినీళ్ళపైపు, సముద్రపు నీళ్ళపైపు వదలబడును. అందులో స్నానంచేయునపుడు హాయిగనుండును. కాని ఉప్పునీళ్లు, కంట్లో తగిలినపుడెల్ల మండును. దగ్గర నొక చిన్నతొట్టిలో మంచినీళ్లు సప్లయిచేయుదురు. ఉప్పునీళ్లు స్నానమైనతరువాత మంచినీళ్ళ స్నానం చేయవలెను. అప్పుడు చాల సౌఖ్యముగ నుండును.

మొత్తముమీద ఈ ప్రయాణము చాల ఆనందకరముగ గడచుచున్నది. అదంతయు భగవత్కృప.

రంగూన్, బర్మా 21-4-29:—

అంగోరా యోడనుండి నీకొక పెద్దలేఖను వ్రాసియుంటిని. అందు నాయనుభవములనెల్ల విస్తరముగ తెలిపియుంటిని. ఈసరి కది నీకు చేరి యుండును.

నీకు వ్రాయవలసిన ఉత్తరమును ముగించిన కొలదినిముషములకే నా కేబిన్ తలుపువద్ద నేదో చప్పుడగుచుండెను. దగ్గరకు వెళ్లితిని. అకరియొక మానవస్వరము "మిస్టర్ మూర్తీ లోనికి రావచ్చునా" యనెను. "యస్" అంటిని. వెంటనే మహమ్మదాలీగారు లోన ప్రవేశించి చాల తొందరగ కాని స్పష్టముగ "అయ్యా మీకు నేను చాల కృతజ్ఞుడను. గతదినము మీరు నాకు చదువుట కిచ్చిన "దయాల్బాగ్" అనే పుస్తకమును కడకంట చూచి నాను. అది నా కాశ్చర్యమును గొల్పుచున్నది. ఇండియాలో నిట్టి చోట్లు గలవా? నేను ఢిల్లీయందుండియు సమీపమున నున్న దయాల్బాగును చూడ కుంటిని. దయాల్బాగులో నిట్టి చిత్రముండుటకు వెనుక నొక గొప్ప మేధావి యుండి యుండవలెను. నేను బర్మానుండి తిరిగి వచ్చిన కొలదిలోనే దక్షిణాఫ్రికా వెళ్లిపోదును. అందుచే బర్మానుండి ఇండియాకు వచ్చుచునే మీ దయాల్బాగును మొదట చూచెదను. నాలుగురోజులు ఆగి అన్నియు తెలిసికొందును. నాతోపాటు నా స్నేహితులును ఢిల్లీ నేషనల్ యూనివర్సిటీకి అధ్యక్షులును అయిన జాకిర్ హుసేన్ గారుకూడ వత్తురు. ఈసంగతి మీరు దయాల్బాగుకు దయచేసి ముందుగ వ్రాయండి" అనెను.

ఆయన మాటాడుచుండగా కూర్చుండి చెప్పవలసినదని కోరితిని. "నేను స్నానమునకు వెళ్లవలెను. కూర్చుండను. కొంచెముసేపునకు మనము చక్కగా చల్లగాలిలో డెక్కుమీద మాటాడుకొందము లెండు. ఈ "దయాల్బాగ్" అనే పుస్తకమును నాకు మీరు ఇచ్చివేయవలెను. కావాలంటే అమెరికాకు వ్రాసి ఇంకొకటి తెప్పించుకొండి. బర్మావారికి నేను దయాల్బాగునుగూర్చి చెప్పవలసియున్నది." అనుచు వెడలిపోయెను. తరువాత మేము కలసికొన్నపుడెల్ల తన స్నేహితులకు నన్ను జూపి "మిస్టరు

మూర్తియే నన్ను కన్వర్టు చేసినాడు (అనగా తన మతమును త్రిప్పుకొని నాడు)" అని చిరునవ్వుతో చెప్పుచుండెను!

ఓడ రంగూను రేవుకు బుధవారం ఉదయము 8 లోపుననే చేరుకొనెను. వెంటనే దరిజేరనీయలేదు. సీపోర్టు ఆఫీసర్లు ఓడలోనికి వచ్చి అందరిని "మీవద్ద తుపాకు లున్నవా"యని అడిగిరి. లేవు లేవని అందరును జవా బొసంగుచుండిరి మహమ్మదాలీగారినికూడ అడిగినారు అడిగిన వెనువెంటనే "నేనే తుపాకును"అన్నారు. ఆఫీసర్లు నవ్వుకొనినారు!

ప్రయాణీకుల సామానులు కూలీలచే వ్రూల్ లోనికి గొంపోబడును. అచ్చట పెట్టెలు తియించి పన్ను విధించవలసిన సరుకు లేమైన నున్న వేమో యని చూచుకొనినవెనుక పోనిత్తురు. వ్రూల్ మీద పనిచేయుచున్న కూలీలందరును తెనుగువాండ్రు. నాసామానును మోసినది పెనుగొండ వాసవ్యుండు యాండ్రి సుబ్బయ్య. "తాణింకి వెంకన్న గారి నెరుగుదువా?" అన్నాను. "తీసుకువస్తానుండండి అయన ఈదగ్గర వ్రూల్ మీదనే యుండును." అని చెప్పి వెళ్ళి 5 నిమిషములలో అయనను నావద్దకు గొని వచ్చెను. నారాక కాయన చాల యానందమును వెలిబుచ్చుచు "మీరు మాకు ముందుగ టెలిగ్రాము యిచ్చెదరు. మేమందరమును కొన్ని వందలున్నాము. మిమ్ములను వ్రూల్ వద్దనె సన్మానింత మనుకొన్నాము. అట్టిది జరుగకుండ టెలిగ్రాంయిచ్చినారు కాను. మా అదృష్టమింతే" అన్నారు. అంతకుముందే నాకొరకు ఇచ్చటి గుజరాతీ వర్తకులు ప్రేమిరాంజీ కంపెనీ వారు ఒక గుమాస్తాను పంపియుండిరి. అయన "మా కొట్టువద్దకు రండి" అంటాడు. వెంకన్నగారు "కర్రి చినవెంకటరెడ్డిగారింటికి రండి"అంటారు. వెంకన్నగారికి కొంచెము నచ్చజెప్పి అయన నేను కలసి గుజరాతీ కంపెనికే వెళ్ళినాము. వారికి నేను ఇండియానుండి తెచ్చిన పరిచయపులేఖ నిచ్చినాను. వారు నన్ను మర్యాద చేసినారు. నేనెందుల కమెరికా వెళ్లుచున్నానో తెలిసికొని చాల సంతోషించినారు. వెంకన్నగారు నన్ను వెంకటరెడ్డిగారింటికి తీసుకు వెళ్ళినారు. అయన భార్యయు బిడ్డలును నన్ను గౌరవించిరి. నా యమెరికా ప్రయాణమున కానందించిరి. నాకు భోజనము దక్షిణదేశపు బ్రాహ్మణుల హోటలులో నేర్పాటుచేసి. వేళలు దాట

కొండ పండ్లను పానీయములను ఇచ్చుచుండిరి. వారి మోటారులో నన్ను ముఖ్యస్థలములకు గొంపోయి చూపుచున్నారు. ఇచ్చట గల మన తెనుగు పెద్దలతో పరిచయ మొనర్చుచున్నారు. ఈ గుజరాతీలు నే నొక్క దినము వారున్నచోటికి రానియెడల చాల ప్రశ్నలు నన్నడుగుదురు. కంపెనీ తాలూకు గుమాస్తాలలో నొకరిని నా వెంటఇచ్చి చూడదగినవన్నియు చూపుమనినారు. వీరికి కొఱతేమి. బస్ మీద, ట్రాములమీద, గుఱ్ఱపు బండ్లలోను, టాక్సీలలోను, లంచాల్లు (రిక్షాలన్నమాట) మీద నన్ను తీసుకువెళ్ళి చూపించుచున్నారు. ఒక్క కాని నన్ను ఖర్చుచేయనీయుట లేదు. మమ్ములను మరచిపోకండి అమెరికానుండి వచ్చినతరువాత అనుచుందురు. ఒక మేడపై వీరందరి నివాసము. అచ్చట గంట గంటకు నాకు అన్నము సహించినదో లేదో, టీ కావలెనేమో, నిద్రపట్టినదో లేదో కనుకొంటూ, కంటికి రెప్పవలె గాచెదరు. వీరందరును ఉదయముననే భగవద్గీతాపారాయణము చేయుదురు. నేను సత్సంగమును చేయుచున్నాను.

ఈ దినమున నన్ను తాణింకి వెంకన్నగారు ఆంధ్రయువజనసంఘము వారి తావుకు తీసుకవెళ్లినారు. అచ్చట నొకసభ జరుగుచుండెను. అదియు చివరకు వచ్చుచుండెను. సాంతముగ వారి యుపన్యాసముల నాలించితిని. అచ్చట నున్న వా రెవరును నన్నెరిగినవారు కారు. సభానంతరము నన్ను వారికి వెంకన్నగారు పరిచయము చేసినారు. అచ్చటనున్న కుర్చీలలో నొక దానిపై నేను కూర్చుంటిని. నా చుట్టును ఆ సంఘసభ్యులు కూర్చుండిరి. నెమ్మది నెమ్మదిగా వారు నన్ను సంభాషణలో దింపిరి. అనేక విషయములనుగూర్చి వారు నాతో మాటాడినారు. ప్రతివిషయమునకు నా సలహాల నడిగిరి. అవి వారికి సంతృప్తికరములుగ నుండెను. నా భాషణ వారి కానందదాయకమయ్యెను. నా ప్రయాణమునకు సంబంధించిన యాదర్శము వారిని పులకాంకితుల జేసెను. వెంటనే వారు నాయందు ప్రేమవర్షమును కురిపించిరి. నాయందువారు సోదరవాత్సల్యమును చూపి సోదరవియోగమున కోర్వమనిరి. అంతలో నందరును ఒక నిమిషము అవతలకు వెళ్ళి ఏమో ఆలోచించుకొని నావద్దకువచ్చి యిట్లనిరి. "మీరు ధనికులు. మీకు మేమేమియు నియవసరములేదు. కాని సన్మానమునకేమి? బర్మా ఆంధ్రుల తరఫున హృదయపూర్వకముగు వీడ్కోలును మీకీయదలచినాము. బుధ

వారం ఉదయం మాతో మీరు ఫోటోకు కూర్చుండుటకును బుధవారం రాత్రి టీపార్టీకిని మీ యంగీకారమును కోరుట చూచుచున్నాము. మీవంటి ధైర్య సాహస సద్గుణసంపత్తిగల యువకులపై మన ఆంధ్రజాతియొక్క గౌరవము నిలబడియున్నది. మిమ్ములను గౌరవించుటయును మనజాతియొక్క ఆదర్శములను గౌరవించుకొనుటయే" అనిరి. "అట్టి గౌరవములను మనజాతిలో నున్న పెద్దలకు చేయదగును." అంటిని. "మరుమాట చెప్పకుడు. మీరు మాకంటికి పెద్దలే" అన్నారు. అప్పటికి చాల చీకటిపడెను. వారమితోత్సాహులై మా మేడవరకు నాతో ప్రసంగించుచువచ్చి దిగబెట్టి వెళ్లినారు. బుధవారమెన్నడాయని యెదురుచూచుచున్నారు అప్పుడే ఆహ్వానములు ప్రింటుకిచ్చినారట. మన ఆంధ్రులలోని వందలకొలది పెద్దలకు ఆహ్వానములు పంపుట కేర్పాటుచేసికొనుచున్నారు. వారు నన్నుగూర్చి మహోపన్యాసముల చేయనున్నారు. ఆవీధిని వెళ్లుచు ముంగరము "ఆంధ్రయువజన సంఘము" అని వ్రాసియున్న దీమేడమీద చూద్దామా? అన్నాను. "ఏమిటీ చూచేదక్కడ" అన్నాడు మాలో ఒకాయన. కాదు చూద్దాము. ఒక్క నిమిషములో తిరిగి తీసుకువస్తాను, నరసింహమూర్తిగారిని, మీరు ఆ అరుగుమీద కూర్చుండుడు" అని చెప్పి వెంకన్నగారు నన్ను పైకితీసుకవచ్చినారు. సభయైనవెంటనే వెళ్ళిపోదామని అనుకొనుచున్న నన్ను నెమ్మదిగా సంభాషణలో పెట్టినారు. అది యింతవరకు తెచ్చినది. బుధవారం వారు చేయబోవుసన్మానము దైవనిర్ణీతము. దానిని తప్పించుకొనుటకు కొంత ప్రయత్నమునుగూడ చేసితిని. కాని తప్పలేదు. ఎంతచప్పుడు లేకుండ అమెరికా వెళ్ళెదమనుకొన్నానో అంతగోల అయిపోవుచున్నది. బుధవారంనాటి సంగతులు లక్ష్మీవారంనాడే పేపర్లెక్కించుకొనును! ఇంతకూ వారి సన్మానమునకు నాకర్హతలేదేమో ననుకొంటున్నాను. వారి యుపన్యాసములకు ప్రత్యుత్తరముగ నేమి దీర్ఘోపన్యాసము చేయవలసి వచ్చునో! (నేను నీతో ననినవిధమున ధోరణిని అట్లు పోనియనులే. నా మాటనమ్ముము.)

ప్రస్తుత మింతే సంగతులు. బర్మానుగూర్చి నేను చూచినదియు తెలిసికొనినదియు వేరుగ వ్రాయుదును. నేను ఆరోగ్యముగను సౌఖ్యముగను ఉన్నట్లు మిత్రులకు తెలుపుము.

# ౭

## ఆంధ్రుల సన్మానము.

టెయిరియావోడనుండి 26-4-1929.

24 వ తేదిని తెల్లవారకమున్నె యొక మోటారు నాకొరకు సిద్ధముగ నుండెను. వెంకన్నగారు దానిపై నన్ను ఆంధ్రయువజనసంఘమున్న మేడవద్దకు తీసుకొనివచ్చెను. మేడపై కెక్కునరికి స్నేహితులు కుర్చీలపై గూర్చుండియుండిరి. నన్నుగాంచి వారు లేచి నమస్కరించిరి. మధ్య నొక కుర్చీపై నన్ను కూరుచుండుమనిరి. వారిప్రక్క కుర్చీలపై గొందరును, ఆప్రక్క కుర్చీలపై కొందరును ఆసీనులైరి. ఇంతలో కార్యదర్శిగారు నా మెడయందు పూలహారమునుంచి, నాచేతికి పూలగుత్తినిచ్చెను. ఆస్థితిలో ఫోటోగ్రాపు తీయబడినది.

సాయంకాలము 8 గంటలకు తిరిగి కారు పంపినారు. దానిపై నేను సంఘమువారి మేడకు వెళ్లితిని. త్రొక్కుడు హార్మోనియంమీద నెవరో రమ్యముగ పాడుచుండిరి. కొన్నివందల యాంధ్రులు సుఖాసీనులయి యాలించుచుండిరి. ప్రెసిడెంటుగా డాక్టరు రఘునాధంగారిని యెన్నుకొనిరి. నన్నాయన తన ప్రక్కకుర్చీకి ఆహ్వానించెను. వెంటనే పుష్పమాలచే నలంకరించి, చేతికి పెద్దపువ్వులగుత్తి నిచ్చిరి.

ఆరాత్రి పలువు రుపన్యాసకులు పలువిధముల నా యాదర్శమును ప్రశంసించుచుండిరి. పలువురు సలహాల నొసంగుచుండిరి. ఒకరు నన్నెరుగుదు రనుకొందును. వారిది పెనుగొండ. వారు నిస్వభావమును. ధైర్యసాహసములను చిత్తస్థైర్యమును ప్రజోపకార జీవితమును, పాతివ్రత్యమునుగూర్చి పొగడిరి. వారు నన్ను బహువిధముల శ్లాఘించిరి. అది యిచ్చట వివరింపను. వారు నన్ను చాలజాగ్రత్త వహింపుడనియు, చిన్నతనము, ఎట్లుందువో యనియు, అమెరికాయనిన స్త్రీలలో అవినీతి కాలవాలమనియు, హితవు నొసంగిరి; ఆంధ్రులందరిపక్షమున (అనగా బర్మాలోని ఆంధ్రులు) రెడ్డియువజన సంఘమువారును, ఆంధ్ర యువజన సంఘమువారును కలసి నాకు వీడ్కోలుపత్రము నొసంగిరి.

ఇవన్నియు నైనవి. నేను ప్రత్యుత్తరము నొసంగవలసిన సమయము వచ్చెను. నన్నొక ఘనునిగ భావించుచుండిరి. నేను ఘనుడను కాదనియు, అనవసరముగ పెద్దవారికి చేయవలసిన మర్యాదల నాకు మీరు చేసివేయు చున్నారనియు, నే నెన్ని పర్యాయములు వారికి చెప్పినను వినలేదు. ఏమి యును చేయుటకు తోచలేదు. మహాపురుషలక్షణములను నేర్చుకొనవలసిన వాడను కాని మహాపురుషుడను కాను. నేనెంత దుర్బలుడనో, నాకొరత లేవియో, నాకును మహాపురుషులకును మధ్య నింకను ఎంతదూర మున్నదో ఇద్దరికి తప్ప మూడవవారికి తెలియదు. భగవంతునికి తెలియును. నాకు తెలియును. ఇతరులకు తెలియమిచే నిట్టి మర్యాదలు నన్ను చేయుచున్నా రనుకొంటిని గదా యనుకొంటిని కాని నాయందుమాత్ర మొకవిశేష మున్నది. నాకు ప్రభువునందు అద్భుతమగు నమ్మిక యొకటి గలదు. దానికి తార్కాణము నా యిప్పటి నిత్యజీవితమే. దేశమునకును దేశమునకును మధ్య అన్ని విషయములలోను ఎట్టి వ్యత్యాసములుండునో మానవప్రకృతి యెంత చిత్రమో పరదేశగమనము చేసినవారికి తెల్లమే. పరాయిదేశముల మధ్య చిత్రవిచిత్ర మానవస్వభావములలో, నడిసముద్రమునందు నడచు ఓడలయందు మెలగు నా కేచిక్కును రాకుండ కాపాడగల శక్తిపరుడు, ప్రేమమూర్తి, యొకడున్నాడను నిరంతర నమ్మికయే నన్ను జీవింపజేయుచు, ఆశాలతలను పెంచుచున్నది కావున నేను నా ప్రత్యుత్తరము మూలమున వారికి సహాయము చేయబోవుటకు ముందు పరాత్పరుని ప్రార్థించుకొంటిని. తరువాత ప్రారంభించితిని. ఎంతమాత్రమును అతిశయోక్తి లేక చెప్పగలను నే నుపన్యసించుచున్నపుడు వారందరి దృష్టులును నాపై కేంద్రీకరింపబడి నవి. ఆ సభలో నిశ్శబ్దమై పోయెను. ఒకానొకప్పుడు మాత్రము సంతోష మును, అంగీకారమును సూచించునట్లు హియర్ హియర్ అను ధ్వనులను కరతాళధ్వనులను చేయుచుండిరి.

వారిలో ప్రబలముగ వ్యాపించియుండిన వ్యభిచారవృత్తికి కారణము వారు స్వదేశమునందు భార్యలను విడిచివచ్చి చాల సంవత్సరముల కొకసారి వారిని చూచి వచ్చుచుంట. ఈవిషయమునుగూర్చియు కూలీలకును మేస్త్రీల కునుగల జాత్తునుగూర్చియు బర్మావారును మనవారును అన్యోన్యముగ

నుండుటనుగూర్చియు చెప్పినాను. నాయాత్రనుగూర్చి మాటాడితిని. నా యుద్దేశ్యములను నాయాదర్శమునుగూర్చి వక్కాణించితిని. మధ్య మధ్య గీతలోని శ్లోకములను పురాణములందలి నిదర్శనమును వెల్లడించితిని. వారంద రును తన్మయత్వము నొందిరని వ్రాసినను అతిశయోక్తి కాదు.

సభానంతరమున వారిలో పెద్దలు "చిన్నవాడవయ్యును పెద్ద హిత మును వాక్రుచ్చినట్టియు ఉన్నతాదర్శమును సాధించనున్నట్టియు నీయందు మేము గర్వించుచున్నాము" అనినారు.

ఉపహారము లొసంగబడినవి. మా గుజరాతీ మిత్రులునుగూడ ఆంధ్రులతోపాటు పాల్గొనిరి.

మొన్న ఫోటోకు కొంతమంది వచ్చుటాలస్యమాయెను. అందుచే తిరిగి నిన్ననుగూడ నొక గ్రూప్ ఫోటో తీయబడినది. ఈ ఫోటో లనువారు పత్రికలకు పంపుదురట. సభలోని యుపన్యాస సారములనుగూడ పత్రికలకు వ్రాయుట కుద్యుక్తులైరి.

గుజరాతీ ఫరంవారు నన్ను వారికంపెనీవద్దకు గొంపోయి పూలహారమును వేసి, చక్కని మాటల నాడిరి. ఓడరేవుకు వారందరును వచ్చిరి. మన ఆంధ్రమిత్రులు చాలమందివచ్చి తిరుగ తిరుగ పూలదండలను వేయుచు నానందించిరి. ఓడ కదిలేవరకు వారు కదలలేదు. వారి యనురాగమును గూర్చి యాలోచించుచు భగవంతుని స్మరించుకొనుచు ఔయిరియా ఓడను సమీపించితిని.

## ఔయిరియా యోడ—హిందీభాష.

రేవువద్దనుండి చిన్న స్టీమ్‌లాంచిలో మమ్మును మా పెట్టెలను ఈ ఔయిరియాకు తీసికొని వెళ్ళినారు. ఇది గట్టుకు వచ్చుటకు వీలులేదు. లోతు చాలదు. అందుచే దీనిని రేవుకు చాలదూరమున తగినంతలోతులో నుంతురు. నీవు యేఅంగోరాయోడను చూచియేయుంటివి. అది మూడువేల టన్నులు. ఇది యారువేల ఐదువందలు. అంగోరా దీనిముందర బొమ్మవలె నుండును. కేబిన్‌లు అంగోరాలోకంటె నెక్కువ విశాలముగనున్నవి. స్నానము గదులలోగూడ (Fans) విసనకర్రలు పెట్టినారు. డెక్ మీద

నుండి చూచువారికి సముద్రముపైన తామొక గోపురశిఖరముపై నున్నట్లుండును. అప్పుడు బంగాళాఖాతము ప్రశాంతముగనున్నది స్టెయిరియా కుదుపులేక నడచుచున్నది. ఏలనో కేబినులలో పూర్తిగ ప్యాసింజర్లు లేనే లేరు నాకేబిను అంతకును నేనొక్కడను. అభ్యాసము చేసికొనుటకు వీలుగ నున్నది. నాకేబిన్ ప్రక్కను ఒకదొర, ఆయనభార్య, ఒకచిన్న అమ్మాయి ఉన్నారు. వారు నన్నిట్టట్టే పలుకరించుచుందురు. డెక్‌మీద నింకను దొరలును దొరసానులను విహరించుచుందురు. వారిలో కొంతమందితో నాకు పరిచయమయినది. కులాసాగా కాలమును వెళ్ళబుచ్చుచున్నాను. ఈస్టీమ్‌షిప్‌లో నెవరును సెకండుక్లాసులో ఇండియనులు కనుపించలేదు. కేబిన్ బోయిజ్ మట్టుకున్నారు ఇండియనులు. వాళ్ళందరికిని వచ్చిరాని యింగ్లీషు. తరువాత హిందీ మాట్లాడుదురు. ఇంకను యేదేశమువరకు హిందీమాట ఉన్నదో తెలియదు. ఇంతవరకు నేను దక్షిణ ఇండియా వదలినది లగాయతు అన్ని ప్రాంతములలోను హిందీ చలాయింపు అగుటను చూచుచున్నాను. హిందీ రాకపోయినయెడల నేను చాలచోట్ల చాల తబ్బిబ్బు పడిపోయియుందును. ఈ యోడయందు అంగోరాలోవలె అన్నము కనుబడదు. రొట్టెతోను బంగాళాదుంప, ఐస్‌క్రీం, బొప్పాయి వెన్నతోను, జాంతోను కాలము గడపుకొనుచున్నాను.

---

౮

కెయిరియా యోమా, 27-4-29

# బర్మాదేశము.

జనాభా మూడులక్షల నలభైవేలు. ఇందు ఆంధ్రులసంఖ్య సుమారు 1 లక్ష. గుజరాతీలుకూడ విస్తారముగ నున్నారు. మహమ్మదీయులును చాలమంది గలరు. పార్సీలు, బెంగాలీలు కొంచెము తక్కువ అనుకొందును. అరవలు ఇప్పుడిప్పుడు దిట్టముగ వచ్చుచున్నారట. ఇది హిందూదేశము లోని యొక మద్రాసువలెనో మరియొక నగరమువలెనో యున్నది గాని ముఖ్యనగరమువలెగాని కాన్పింపదు ఏలనన బర్మావారు ఉండవలసినంత మంది యిక్కడ లేరు. వారి ముఖ్యపట్టణములో వారు తగినంతమంది లేరు.

వైశాల్యము—22 మైళ్ళ చదరము. చాల పెద్దదన్నమాట. క్రొత్తగా కట్టిన రంగూన్ పాతరంగూన్ కంటె బాగుగనుండును. వీధులు చాల పెద్దవి. తరువాత ఒక్కొక్క రోడ్డు ఎన్ని మైళ్ళ పొడుగైన నుండును.

ప్రయాణసౌకర్యములు—రంగూన్‌లోని చాల భాగములకు రైలు స్టేషన్లున్నవి. పగలంతయు బజారులలో కష్టపడి. చీకటిపడగనే, రైలు మార్గమున యిండ్లకు బోవచ్చును. మోటారు బస్‌లు చాలగలవు. రాత్రింబగళ్లు జనులను కూరుచుండబెట్టుకొని పరువెత్తికొని పోవుచుండును. టాక్సీలకు పగలంతయు పనియుండును. గుర్రపుబళ్ళు (పెట్టిబళ్ళు) కూడ పని చేయుచుండును. రిక్షాలున్నవి. రాత్రి పండ్రెండువరకు నడచుట నేను చూచితిని.

మ్యునిసిపాలిటీ-నగరమును అతిపరిశుభ్రముగ నుంతురు. కలకత్తాలో వలె రాతి యిటుకల రోడ్లుగాని, ఇరుకు సందులుగాని మురికినీరు వీధులలో నుండుటగాని, మురికికంపు ముక్కులను బ్రద్దలుచేయుచుంటగాని యిట గాంచము. చక్కని నీటిసప్లయి. ఎటగాంచినను ఎలక్ట్రిక్ దీపములు. ఎక్కడనైన యింటికి నిప్పంటుకుంటే ఆర్పివేయుటకు మున్సిపాలిటీ తాలూకు సెంట్రల్ ఫైర్ స్టేషన్‌లోని ఇంజనులు సిద్ధము.

పోలీసు:—ప్రతివీధి చివరను వీధిమొగను వీధిమధ్య నిలబడి యొక పోలీసు మనిషి యెప్పుడును వచ్చే బండిని వెళ్ళేబండిని సిగ్నల్ చేయును. అతడు వెళ్ళమని సిగ్నల్ చేస్తేతప్ప, ఏబండియు కదలదు. ఇందువలన అనేక మంది బళ్లక్రిందపడి చచ్చుట తగ్గిపోయినది.

న్యాయశాఖ:—అన్ని కోర్టులలోను ప్లీడరున్నారు. ప్లీడర్లలోగూడ హైందవులే యెక్కువ మంది. ప్లీడరు కోర్టువారితో ఇంగ్లీషున మాటాడును. పార్టీని హిందీలో అడుగుచుండును. మాటకారులు తక్కువ. కొద్దినిమిష ములలోనే నిజము తేలిపోవుచుండునట.

కూలివృత్తి:—ఇదియిక్కడ ప్రత్యేకము కోరంగులని పిలువబడు మన ఆంధ్రులే ఈ కూలివృత్తి నంతటని గుత్తగొనినారు. నే నెరిగినంతవరకు కోరంగి తప్ప మరొకడు రిక్షాలాగుటలేదు. బస్తాలు మోయుట, సామా నులు మోయుట, ఫ్యాక్టొరీ నౌకరీ, చాకలిపని; అదియిది యననేల కూలివృత్తి అంతయు తెలుగువాడే. వీరిలో మరొకవృత్తి నవలంబించిన వారు బహు అరుదు

వ్యాపారము:—రంగూన్ కూడ గొప్ప రేవుపట్టణము. ఐరావతీ నదీ ముఖమున నున్నది. ఎన్నిదేశముల యోడలో గాన్పించుచుండును. అన్ని దేశముల వారికిని ఇచ్చట గోదాములు, ఫ్యాక్టొరీలు, షాపులు, కంపెనీలు గలవు. కాని యెక్క బర్మాదేశజుడు కూడ పెద్ద వ్యాపారములో లేడు. మన జనులందరును కూలిలోనున్నారు. చెట్టివాళ్ళు అచ్చటచట రాజమండ్రి కోమట్లు కాకినాడ కోమట్లు నగల దుకాణములను ఇతర దుకాణములను పెట్టుకొని యున్నారు. హిందూదేశస్థులలో గుజరాతీ లిచ్చట చక్కగా వ్యాపారమును నడుపుకొనుచుందురు.

ఫ్యాక్టొరీలు:—ఇంత పెద్ద ఫ్యాక్టొరీలు ఇండియాలో తక్కువ. రైసు ఫ్యాక్టొరీల ప్రక్కన పెద్ద గోదాములు కట్టబడియున్నవి. బర్మాలో అతి విస్తారమైన ధాన్యపుపంట యున్నది. ఈఫ్యాక్టొరీలవద్దకు రాగానే ఆపంట కచ్చేరువగును.

సరుకులు:—బర్మాలో అపరాలుగూడ చాల యెక్కువగ పండును. ఎక్కడచూచినను కలపే. అడవి యెక్కువ. దంతపుపనులు చాలరకములు దొరకును. రత్నములు, వజ్రములు గల గనులున్నవి. పట్టు కొద్దిగా గలదు

నివేశనస్థలములు:—చాల యిరుకు. ఒక్కొక్క యింటిలో చాల కుటుంబములుండును. అద్దెలు చాల హెచ్చు. గజముఖరీదు ఎన్నో వందలుండును.

దురభ్యాసములు:—ప్రతివాడును టీ ఎన్నోసార్లు త్రాగెదరు. చుట్టలను, సిగరెట్లను, బీడీలను పీల్చుచుందురు. బర్మావానిచుట్ట మనతూటాతో సరిగా పోల్చవచ్చును. బర్మాస్త్రీలు ఈతూటాలను ఎప్పుడును తగలవేయుచుందురు. మన హిందువులెక్కువగ పాన్ వేయుచుందురు. తెలుగుకూలీలలోను, బర్మాపురుషులలోను త్రాగుడెక్కువ. వ్యభిచారమునకు పెట్టినది పేరు రంగూన్. ఆంధ్రులలో నెవరును భార్యల నిటకు తీసుకొనిరాక, చాలసంవత్సరములకొకసారి దేశము వెళ్ళి వచ్చుచుందురు. ఇచ్చట వీరు ఉంపుడుకత్తెలతో కాలమును సరిపెట్టుకొందురు. వ్యభిచారవృత్తియందున్న ఆంధ్రస్త్రీలు విస్తారముగ నిక్కడకు లేచివత్తురు. అందులో కొందరు లెక్కలేని సంకటములకు పాలైనవారు మనదేశమున అడుక్కొనుటకు గూడ పనికిరానిముండ లిక్కడొక కొండ. ఛీ, ఆంధ్రులెన్నడు ఈ దురభ్యాసమునకు దూరులగుదురో, బర్మా ఆడుదాని కతిస్వాతంత్ర్యము. పురుషుడు కడుసోమరి, త్రాగుబోతు. ఆడపిల్లలకును, మొగపిల్లలకును ఆస్తి సమముగ పంచబడును. వీండ్లలో పెండ్లిఅంటూ వేరే లేదు. ఎవడితోనో లేచిపోవును. కొన్నాళ్ళయినాక వాడు అది యింటికివస్తారు. కాపురము చేస్తారు. అదే పెళ్ళి. గొప్పడాక్టర్లు చాల యనుభవముమీద చెప్పినదేమంటే "బర్మాలోని సుఖజాడ్యములు దారుణమైనవి."

నాటుకోటిశెట్లు:—వీరు కోటీశ్వరులు. బర్మాలో వడ్డీవ్యాపారము చేయుదురు. వారివద్ద ఎప్పటికైన ఎక్కువమాటగాని తక్కువయుండదు. నూటికి రు 8-2-0 లు చాల సరసమయినదట. అప్పిచ్చుచునే వడ్డీ అర్జంటుగా మొదటనే తీసుకొందురు. వారు గొప్ప ఇనుపబీరువాలలో ధనమును పోసుకొని, దానినే కాపాడుకొనుచు, నిరంతరము ధ్యానము చేయుచు, దానిని విడువనే విడువరు.

గోపురములు:—వీటిని ఫయ్యాలందురు. ఒక ధ్వజస్తంభముండును. చుట్టూరా చిన్న గుడులుండును. గోపురములోని చాలచోట్ల అనగా ధ్వజ

రును. జేడివాండ్రు ఒక్కొక్కప్పుడు స్త్రీపురుషతారతమ్యము గనుపడదు. అందుచే పురుషులు తెల్లగుడ్డ చుట్టుదురు. స్త్రీలు తమ పెద్దజుట్టును నల్లని టోపీవలె నెత్తిపై నమర్చుదురు. ఇదియే తేడా!



## ౬

(మకాం) కులాలంపూర్, మలయద్వీపము, 30 4-29

నిన్న రాత్రి పెనాంగ్ నుంచి బయలుదేరి ట్రెయిన్ మీద ఈ పట్టణమును చేరినాము. ఈయుత్తరము మధ్యాహ్నము సుమారు 12 గంటలకు వ్రాయుచున్నాను. క్షేమముగను ఆరోగ్యముగను ఉన్నాను. పెనాంగ్ చేరుటకు ముందు విశేషములన్నియు గత లేఖలో తెలిపియుంటిని. ఆ లేఖను పెనాంగ్ పోస్టాఫీసులో వేసియుంటిని. పెనాంగ్ చేరినది లగాయతు విశేషములను ముందుముందు పంపెదను. ఒకొకప్పుడు నాకు సావకాశము చాల తక్కువగనుండును. అందుచే పెద్ద యుత్తరములను వ్రాయజాలకున్నాను. సావకాశము ఎక్కువగా ఓడలో లభించుచుండును. ఆయా సమయములందు నీకు పెద్దజాబులను వ్రాయగలను. కాని నేను చేరే ప్రతి దేశము నుండియు ప్రతి గ్రామము నుండియు నీకు ఏదోయొక చిన్న జాబు వ్రాయుచుందును. నే నీరాత్రి మెయిల్ ట్రెయిన్‌లో బయలుదేరి రేపు ఉదయమునకు సింగపూర్ చేరెదను. అటనుండికూడ నీకు సాధ్యమైన వెంటనే తెలుపుదును.

సింగపూర్, 1—5—29.

కులాలంపూరునుండి నీకు ఉత్తరమును వ్రాసియుంటిని. నిన్న రాత్రి మెయిలు ట్రెయిన్‌లో నటనుండి బయలుదేరి ఈ ఉదయము సుమారు 7 గంటలకు సింగపూర్ చేరినాను. మద్రాస్‌లోని స్నేహితు లొకరు ఇచ్చటి థియసాఫికల్ సొసైటీయొక్క కార్యదర్శికి ఉత్తరమును ఇచ్చినారు. ఆ యుత్తరముపై వ్రాయబడిన చిరునామా ప్రకారము ప్రయత్నముచేయగా,

యసాఫికల్ లాడ్జికి బదులు ఒక చైనావాని యిల్లున్నది. ఏమిచేయ్యవలెనాయని యూహించుచుండగా, కులాలంపూర్‌లోని ఇండియా ప్రభుత్వము తరఫున ఏజెంటుగా పనిచేయుచున్న రావు సాహెబ్ ఆర్. సుబ్బయ్యా నాయుడుగారితో మాట్లాడుచుండగా ప్రసంగవశమున ఆయన నాతో చెప్పిన 3 నంబరు ఓవెన్‌రోడ్డులోని ఇండియన్ ఎసోసియేషన్ సంగతి జ్ఞప్తికివచ్చినది. ఎవరో ట్రెయిన్‌లో నేను వెదకుచున్న ఆరేస్‌కోర్సురోడ్డుకు ఓవెన్‌రోడ్డు చాల సమీపమె అన్నట్లు జ్ఞాపకము. కాబట్టి ఓవెన్‌రోడ్డుకు బండిని త్రిప్పించినాను. ఇంతలో త్రోవలో రేస్‌కోర్సులేన్‌లో 20 నంబరు ఇంటిమీద "రామకృష్ణా మిషన్" అని వ్రాయబడి యుంటను గాంచి లోనికివెళ్ళి భోగట్టా చేసితిని. ఇందొక స్వాములవారున్నారు. "తాత్కాలికముగ సామాను ఇక్కడ నుంచుకొనవచ్చును. తరువాత కార్యదర్శి కొరకు వెదకుడు" అనెను. అందువలన నా పెట్టెలతో ఇచ్చట దిగినాను. ఈ సాయంకాలము కార్యదర్శి కొరకు వెళ్ళెదను. నేడే బహుశః తామస్ కుక్కు కంపెనీవారివద్దకు పోయి జపాన్‌కు టిక్కెట్టు తీసుకొనెదను. త్రోవలోనున్న చైనా రేవుస్థలములలో ఓడతోపాటే నేనును ఆగి చూచెదను. అంతకంటె ప్రస్తుతము ఆగుటకు వీలులేదు. చైనాదేశము రాచకీయముగ అల్లకల్లోలములో నున్నది. ఇటునుండి జపానుకు దగ్గర దగ్గరగా 3 వారముల ప్రయాణ మనినారు.

# ౧౦

## మలయా దేశము పెనాంగ్ పట్టణము:

టొల్మ్రయోడ, జూలై 7:—

సైరియాయోడ, పెనాంగ్‌కు ఫర్లాంగుదూరములో ఆగిపోయినది. అది పెద్దయోడ. ఒడ్డునలోతుచాలదు. అందుచే దూరముననే ఆగవలసివచ్చెను. ఒక చిన్న స్టీమరునెక్కి గట్టుకు చేరినాము. ఏవంకజూచినను అరవకూలీలే సామానులు మోసినారు. హోటలులో ప్రవేశించినాము. మేము ప్రవేశించగనే, మమ్ము కనిపెట్టి ఒకసాహెబు ప్రవేశించినాడు. నేను హిందుస్తాని మాట్లాడినాను. వానికి హిందుస్తాని వచ్చినగదా! అరవములో ప్రత్యుత్తరమిచ్చినాడు. మావద్దనున్న రూపాయలు. అణాలు మలయా దేశపు డాలర్లు. సెంట్లలోనికి మార్చినాము. భోజనమును కుర్చీమీద కూర్చుండుడని హోటలులోని అరవబ్రాహ్మణుడనినాడు. మేబల్లమీద అరటాకులో వడ్డించినాడు. ఊరుచూచుటకు బయటకు వెళ్ళినాము. పెద్దవీధులు కొంచెము వెడల్పు తక్కువనినమాటయే కాని, శుభ్రముగ కట్టబడినవి. తారురోడ్లు. ఏమి తమాషగా లెవెల్ వేసినారు! వర్షము వెలసగనే రోడ్లపై ఒకచుక్కనీరు నిలువయుండదు. కొన్నిరోడ్లకు ట్రాఫిక్ యెక్కువ. అందులో సముద్రపు గట్టునయున్న రోడ్డు ఎప్పుడుచూచినను సంతరోజున పాలకొల్లు పెద్దవీధివలె నుండును. కొన్ని వీధులలో చాలపెద్ద కంపెనీలున్నవి. పెద్దకంపెనీలన్నియు దొరలవే. బళ్ళమీద నెల్లప్పుడును రబ్బరు అట్టలు ఎక్కించి రవానాచేయుచుందురు. పట్టణమంతటను చైనావారి షాపులు. నూటికొకటి మహమ్మదీయునిదో, గుజరాతీ వైశ్యునిదో ఉండును. ఊరునిండ లంచాలున్నవి. చైనావారు ఇంకొక జాతివానిని ఈ రిక్షాలను లాగనియ్యరు. కూలిపని చాలవరకు అరవలు చేయుచున్నారు. సాక్షాత్తు తెలుగుకూలీయైనను కనుపించలేదు. ఇచ్చట రెండు క్రొత్త పద్ధతులు చూచినాను. మొదటిది త్రొక్కుడుబండ్లు వెనుక నొక గద్దెమో పంత పెద్దబుట్టనిండ ఏమోసరకు వేసికొని, ముందొకమూట పెట్టుకొని, చైనావారు త్రొక్కుకొని పోదురు. రెండవది పట్టాలులేని ట్రామ్! మోటారు బస్సే ఎలక్ట్రిక్ తీగెల సహాయమున నడపుచున్నారు.

క్వాలాలంపూరు:—

పెనాంగ్ నుండి క్వాలాలంపూర్ కు 12 గంటల రైలుప్రయాణము. ఇదియు నొక పెద్దపట్టణమె కాని శుభ్రత తక్కువ. ఇచ్చట రెండెడ్లబండ్లు కనుపించినవి మన ప్రాంతములలో కోమటవాండ్లు ఊరిబయట వేయు ఒకానొక పెద్ద పొడుగుపాటి గుడిసెవలె నున్న వీథులు. ఈ నగరము నందున్న ఉద్యానవనము చూడదగినది. చాల పెద్దది. ఇంపుగ నుండును. మనదేశమున గానరాని పుష్పజాతుల నెన్నిటినో చూచినాను. ఒక బవర్ అద్దములతో కట్టబడినది. ఈ బవర్ లో నెన్నటికిని మరపురాని సౌందర్యము గల పూవులున్నవి. మ్యూజియమ్ చిన్నదే కాని మనదేశమున కనుపడని కొన్ని జంతువుల నిట జూడనగును. కొన్ని పెద్దపాములను చూపినారు. వాని కాటు చాల నిరపాయమట. కొన్ని జెర్రెలను చూపినారు. కఱచిన మరుక్షణముననె చావు తప్పదట. హిందూదేశముయొక్క ప్రభుత్వము తరపున ఇచట రావుసాహెబ్ ఆర్. సుబ్బయ్యనాయుడుగారు ఏజంటుగ నున్నారు. ఈయన నెల్లూరునివాసి. తెలుగుదేశమున కొంతకాలము డెప్యూటీకలెక్టరుగ పనిచేసినట్లు తెలియుచున్నది. చామనచాయవాడు. దీర్ఘకాయుడని చెప్పవచ్చును. నాతో నాంధ్రమున ముచ్చటించెను. అమెరికా వెళ్ళుటలో నా యుద్దేశ్యమును కనుగొని నన్నాశీర్వదించెను. మలయాదేశముయొక్క వర్తకము చైనావారి హస్తగతమై యున్నదనియు ఇప్పటికైన హిందూదేశీయులకు మలయాలో నవకాశములు తక్కువగ లేవనియు చెప్పి, "మీబోంట్లు ఈ దేశముననున్న తగరపు గనులను, రబ్బరు తోటలను చూడవలసిన"దే యనెను. గోదావరిజిల్లానుండి యిట కెగుమతి కాదగిన సరకుల పేర్లను వ్రాసికొనెను. నర్సాపురములో ఆయనకు తెలిసిన యెర్రగెన్నపంతులుగారు వగైరాల క్షేమము నడిగెను. మన దేశమునకు సంబంధించిన యనేకసంగతులను నాతో ప్రసంగించి చాలసేపైన తరువాత "మీరు నన్ను చూడవచ్చుట చాల సంతోషకరము. చూడవచ్చినందుకు వందనములు. మీకు ఆనందదాయకమగు ప్రయాణము సిద్ధించునుగాక" యనెను.

సింగపూర్:—

కోలాలంపూర్ నుండి యిటకు 12 గంటల రైలుప్రయాణము. త్రోవపొడుగునను ప్రకృతిమాత సౌందర్యమును కన్నులపండువుగ చూడ వచ్చును. సింగపూరులో టేంకురోడ్ అను స్టేషణ్ పెద్దది. అటనుండి మేము ఒక అరవవాని గుర్రపుబండిపై రామకృష్ణమిషణ్ వారి భవనముకు వెళ్ళినాము. ఇందుకు సంబంధించిన మెంబర్లు నూరుగురు గలరు. నెలకొక డాలరు చందా నిచ్చుచున్నారు. ఈ మిషన్ భవనమున ప్రస్తుతమున్న స్వాములవారు చాలమంచివారు. ఆయనతో నేను భారతలంచ్ హోమ్‌కు వెళ్లినాను. ఈహోటలు అరవవారిది. ఇటనుండి తియసాఫికల్ లాడ్జి కొంచెముదూరమె. తియసాఫికల్ లాడ్జికి ఒక దొరసాని అధ్యక్షురాలుగను ఒక దొరసాని లైబ్రేరియణ్ గను ఉన్నారు. నా స్నేహితులైన రాముని మోననుగారు కార్యదర్శిగనున్నారు. వీరు నన్ను మోటారుపై చాల రోడ్లకు తీసుకొనివెళ్ళినారు. అన్ని రోడ్లును చాల పొడవుగనున్నవి. కాని మెలికలదిరిగి వంకరగబోవును. ఇరుప్రక్కలను చక్కని ఎత్తైనస్థలము, పచ్చనిచెట్లు, రంగురంగుల పూవులు కొన్నిచోట్లు. ఈ రోడ్ల ననుసరించిన కొండలపై దివ్యభవనముల నిర్మించుకొని తెల్లవారు నివసించుచున్నారు.

దరహాముమీాద:

తెల్లవా రెక్కడ నున్నను సురక్షితముగను, హాయిగను ఉన్నారు. మలయా దేశమునిండ చైనావారు కలరు. వారు ప్రతికమును చేసికొందురు. ఇంకను అన్నివృత్తులలోను ఉన్నారు. అరవలు హిందూదేశపు జాతులలో నన్నిటికంటె నెక్కువగనున్నారు. తెలుగువారు నా కెచటను కానరాలేదు. ఈ మలయాదేశమంతటను పెద్దపెద్ద రబ్బరుతోటలు గలవు. తగరపు గనులును గలవు. ఒక్క తోటకాని ఒక్క గనికాని మలేవారి చేతులలో నున్నట్లు తోచదు. ఆజాతి సోమరిపోతుతనముకు పెట్టినది పేరు. క్రమముగ జాతియె నశించుచున్నది. మలేలో మలేవారు ఎచ్చటనోగాని కాన్పించరు. వారేయడవులలోనో నివసింతురు. కొందరు తోటలలో కూలికిపనిచేయుదురు, మోటారు డ్రైవర్లుగను, పోలీసు యుద్యోగమందును మాత్రమె మలేలు

కనుపింతురు. చాలవరకు మలేలందరును దరిద్రులు, వారికి ఒక వరకమందు గాని ఒక చేతిపనియందుగాని జోక్యములేదు. ఇతరదేశీయులు మలేయొక్క వర్తకమును భాగ్యమును గుత్తగొనుచుండగా మలేలు నోరుతెరచుకొని ఆకాశమువంక చూచుచున్నారు. వారిగతి "అన్నియు నున్నవి, అల్లుని నోట్లో శని" యనునట్లున్నది.



# ౧౧

హాంకాంగ్, చైనాదేశము.

9-5-29. 4 గంటలకు.

ఇంకను హాంకాంగ్ ఎన్నో మైళ్లున్నదనగనే పర్వతపంక్తులు ప్రారంభమైనవి. అవి యంతగా యెత్తైనవికావు. అవి పచ్చగానున్నవి. ఓడరేవును సమీపించిన కొలదియు ఆ పర్వతములపై యిండ్లు కనుపించినవి హాంకాంగ్ పట్టణమంతయు పర్వతములమీదను, ప్రక్కను కట్టబడినది. కొన్ని పెద్దమేడలు కనుబడినవి. అందొకటి ఏడంతసులది. అది హోటెల్. దాని పేరు పెనిన్సులా హోటేలు. మాయోడలోనున్న చైనావారి మొగము లన్నియు నవ్వుచుండెను. వారి స్వదేశమును చేరునపుడు వారి కానందము సహజమే. రేవు చేరేసరికి ఓడవద్దకు అనేక చిన్నపడవలు చేరినవి. వాటిని డింగీలనవచ్చును. కాని మన డింగీలకును ఈ డింగీలకును చాల భేదము గలదు. ఒకచిత్రమేమన ఈ డింగీలను చైనా స్త్రీలే నడపుచున్నారు. చిన్నపిల్లలు నడివయసు యువతులు, ముసలివాండ్రుకూడ నడుపుటను చూచినాను. బిడ్డలున్న స్త్రీలు బిడ్డను వీపుమీదకట్టుకొని నిర్భయముగ చుక్కాని పట్టుదురు. తెడ్డువేయుదురు, గడవేయుదురు. వీండ్లెంత మోటువారో చూడుము. ఒక యువతి పెద్దపెద్ద సామానులను మోయుచున్నది. ఆమె కూలిచేసికొని బ్రతుకును. ఇట్లు కూలిచే బ్రతుకువారు చాలమంది స్త్రీలున్నారు. పురుషులన్ననో చెప్పనక్కరలేదు. చాల మోటుమనుష్యులు. పెద్దపెద్ద పెట్టెలను ఒక త్రాడునగట్టి, ఒకటొకటే నెమ్మదిగా సునా

యాసముగా ఆటబొమ్మలవలె ఒక్కొక్క చైనావాడు ఓడ ప్రక్కనున్న
చిన్న పడవలలోనికి దింపుచున్నాడు. చైనాలో మగవాండ్రు పేడివాండ్రు.
మస్తులలో స్త్రీలకును వీరికిని తేడాలేదు ప్రతీవాడును బోడిగుండో లేక
ఇస్లాయో యుంచుకొనును. తాటిపండువంటి చాయ, గుండ్రని మొగ
ములు, తప్పడముక్కులు, చిన్నకండ్లు పెద్దమొగములు. ఆడవాండ్రు పెద్ద
జుట్టును గలిగి, దానిని వెనుక ముడివేయుటో లేక అతి పొడుగుగా జడె
నల్లుటో చేయుదురు. పొడుగు తక్కువ అంగరకా తొడుక్కొని, ఇజారు
వేసికొందురు. వారు సాధారణముగా మెరీనావంటి నల్లటి మస్తులను
తొడుగుకొని తాటియాకుల కుళాయిని నెత్తిపై పెట్టికొందురు. ఇంకొక
చిత్రము: ఓడమీదకు త్రాడుమీద నెగబ్రాకినారు. అంత సునాయాస
ముగ ఒక కోతిమాత్రమే యెగబ్రాక గలదనుకొందును. కోతి నాలుగు
కాళ్ళతో ఎగబ్రాకును. వీరొక్క చేతులతోడనే (కాళ్ళకు చెప్పులున్నవి.)
ఆ పొడుగుపాటి త్రాటిని. ఎక్కిపోయి ఓడలో నిముసములో ప్రవేశించి
నారు.

రాత్రి 8 గంటలకు.

ఈ దినమున భోజనము చాల ఆలస్యమైనది. కొంచెము సేపు సత్సంగ
మును చేసుకొని, ఒక్క నిముసము చల్లగాలిలో తిరుగుటకు డెక్ మీదకు
వెళ్ళినాను. ఏమని చెప్పుదును? చెప్పగలను? ఒక విచిత్రదృశ్యము నా కంట
బడినది. ఈ పట్టణముయొక్క భవనములన్నియు పర్వతపంక్తిపైనను,
ప్రక్కను కట్టబడినవని వ్రాసియేయుంటిని. ఆపర్వతములమీదను ప్రక్కను
పచ్చని చెట్లున్నవి. రాత్రివేళను పర్వతమంతయు నల్లగను, దానిపైనున్న
కట్టడములు తెల్లవాటుగను. కనుబడవలెగదా. అటుగాక, పర్వతపంక్తి
యంతయు వజ్రవైడూర్యగోమేధికపుష్యరాగమరకతమాణిక్యములు వెద
జల్లబడినట్లు ధగధగాయమానంబై, చూపరుల డెందంబుల నచ్చెరువొం
దింప జేయుచు, ప్రకాశించుచున్నది. అనేకవేల నక్షత్రము లొక్కసారిగ
ఆకాశమునుండి రాలి, యా పర్వతపంక్తిని అచటచట నాతి దూరమునపడి,
మినుకుమినుకు మనుచున్నవో యనునట్లున్నది. ఆకుపచ్చని యా చెట్లుగల
స్థలములన్నియు తళతళలాడు ఉదారంగును వేసికొనినట్లున్నది కలకత్తా
హోనిపరశుదేవునిగుడిలో లోపలనొకచోట మనము గాంచిన మణిచకితమగు

వెలుగు యొక్క శోభను జ్ఞప్తికి దెచ్చుకొని ఆ దేదీప్యమున నొక పెద్ద దీపావళి పంక్తి యంతయు నున్నదనుకొని భావించి చూడుము. వెంటనే పెదవుల చివరకు "అద్భుతము" అను మాటవచ్చును. కన్నులపండుగ యన నిదియేగాని ప్రపంచమున మరొండు కాదు. నాజీవితకాలమున నింతవరకును నిట్టి దృశ్యమును గాంచలేదు. దూరమున నిలుపబడిన యీ యోడమీద వారికి హాంకాంగ్‌లోని యెలక్ట్రిక్ లయిట్ల మాలికను పట్టణమంతయు నంత చిత్రముగ గనుపించుచున్నది!

10-5-29 ఉదయము:—

తెల్లవారినది. సత్సంగము చేసుకొనుటకు గూడ వీలులేకుండ విరామము లేకుండ ధ్వనులు వినిపించుచున్నవి. మాయోడచుట్టును ఒక బ్రిడ్జి చిన్న చిన్న డింగీలు చిన్న స్టీమర్లు పెద్దయోడలు నిలబడియున్నవి, కూలీలు ఎన్నివేల జనమో పనిచేయుచున్నారు. మాటలసందడి ఎక్కించె సరుకులు దించేసరుకులు స్టీమర్ల కూతలు పుల్లీలు (అనగా కప్పీలు) ధ్వని మనుష్యులు ఓడల నెక్కుటకు క్రిందికిదింపి యుంచబడిన మేడమెట్లులాంటి నిచ్చెనలపై నడచునపుడు టక్ టక్ మని చప్పుడు ఇంజన్ల రొదసమితము లేకుండ జేయుచున్నవి. హాంకాంగ్ రేవుపట్టణములోని గొప్ప రేవులలో నొకటియట. తూర్పు దేశములకు వచ్చు ప్రతియోడయు ఇచ్చటనాగును.

హాంకాంగ్, 10-5-29. ఉదయం పదిగంటలకు.

నేనిక్కడే యోడదిగి కౌలోన్ పోష్టాఫీసుకు వెళ్ళినాను మీా కుత్తరములు వేయుటకు. పూల్ అంతయు సామానులను మోసికొనిపోవు ట్రక్కుల కోసం ఆ ట్రక్కులనుండి సామానును ఎత్తి ఓడలలో వేసికొను కేనులతోను నిండియున్నది. పూల్ ను దాటి యవతలకు బోతిమేని కౌలోను పట్టణము ప్రారంభమగును. తారురోడ్లు చాల శుభ్రముగను, విశాలముగను ఉన్నవి. పోష్టాఫీసుకడకు వెళ్ళినాము. ఇండియాకు కవరు కెంతయని ప్రశ్నించగా, "నాలుగు సెంట్లు" అన్నారు. మనకు దగ్గర దేశమైన మలయాలో సె 6 సెంట్లు ఇక్కడ 4 సెంట్లే. ఈ హాంకాంగుసెంట్లు మలేసెంట్లుకన్న విలువ తక్కువ. 88 మలేసెంటకు 100 హాంకాంగ్ సెంట్లు వచ్చును. పదిసెంట్ల కొక వార్తాపత్రిక. ఈ పత్రికలను వీధులలో నిలబడి ఆడవాళ్లును పిల్లవాండ్రును అమ్ముచున్నారు.

10—5—29, పదిగంటలు దాటిన తరువాత.

టాల్స్ట్రయోడను కౌలోన్‌గట్టున నిల్పినారు. కౌలోనునుండి హాంకాంగ్‌కు బోవుటకు ఒక రేవున్నది. ఆరేవునకు చిన్నస్టీమర్లు 10 నిముషములకొకటి చొప్పున పగలంతయును రాత్రి 12 గంటలవరకును వచ్చుచు బోవుచుండును. కౌలోనునుండి హాంకాంగ్‌కు బోవుటకు 5 నిముషములు పట్టును. పదిసెంట్లు రేటు. మేము కొందరము కలసి హాంకాంగ్‌కు బోతిమి. 5. 6 అంతసుల మేడలు గట్టుననున్నవి. ఆ యంతసులు మాకు ఓడనుండి పావురముగూళ్ళవలె కనుపించియుండెను. హాంకాంగ్‌లోని పూల యంగళ్ళగను చూడవలసినదె. కమ్మనివాసన రంగురంగుల పూవులచే అంగడినంతయు నలంకరింతురు. రకరకముల పచ్చని యాకులను తీగెలను కలపి గుండ్రముగా పీపాకట్టువలె చుట్టి, దానిపై పలుతెరంగుల పుష్పములను గ్రుచ్చి, అమ్మజూపెదరు. పూల మకాణములనుండి పర్వతముపైకి వీధులున్నవి. కొన్నిచోట్ల మెట్లుపర్చియున్నవి. కొన్నిచోట్ల సాఫుగనెఉన్నది. మెట్లుపర్చినవీధులలోగాక మిగిలినవీధులన్నిటిలోను మోటారులు నడచును.

పర్వతవీధులను మోటారు నడుపుట కష్టము. ఎక్కునపుడు డ్రైవరు ఎంతమాత్రము శ్రద్ధగనున్నను కారు పాతాళమున బడిపోయినట్లు గిరగిర గిరగిర దొర్లుకొనుచు వచ్చి సముద్రమున బడును. ఈ పర్వతవీధులపైకిబోవునపుడు తిరుపతికొండ మీదికి బోవుచున్నట్లుండును. తిరుపతిలోవలెనే ఇచ్చటగూడ డోలీలున్నవి. అవి తిరుపతిడోలీలమాదిరి గాక మనదేశములో శోభనపు పెండ్లికొడుకును ఊరేగించు పల్లకీలవలె నుండును. కాని కొంచెము చిన్నదిగానుండి, ముందొక మనిషిచేతను వెనుకతట్టు నొక మనిషిచేతను మోయబడును. ఇంకను లంచాలున్నవి. చదునైన రోడ్లమీద పీటని లాగుకొనిపోవుట కొకడు చాలియుండును. ఈ పర్వతము రోడ్లనుండి క్రిందకు దిగునపుడు గబగబ దొర్లిపోకుండ నిద్దరు త్రాళ్ళతో వెనుకకు నదిమి పట్టుచుందురు. ఈరిక్షాలే గాక, టాక్సీలును, బస్‌లును, ట్రాములును గలవు. మేమొక బస్‌మీద రిపల్స్‌బే అనుచోటికి వెళ్ళినాము. పర్వతములపై నెక్కుటకు పాము మెలికలవలె రోడ్లు వంకరదిరిగి యున్నవి. పర్వతము చుట్టును తిరిగితిరిగి పర్వతముమీదికి బోవలెను. బస్‌లోనుండి చూచుచున్నపుడు చాలా ఆనందముగ నుండును. పైకిజూచిన నెత్తయినకొండలు ప్రక్కను ప్రకృతిసౌందర్యము క్రిందను అగాధమగు లోయలు! మోటారు మేఘములమధ్యనుండి బోవును.

మధ్యాహ్నము, 11—5—35 హాంకాంగు.

హాంకాంగులోని ట్రామ్వేలాంటి ట్రామ్వే ప్రపంచమున నింకెక్కడైన నున్నదో లేదో నాకు తెలియదు. నేనుమట్టుకు ఎక్కడను చూచి యుండలేదు. అది యెన్నటికిని మరువజాలని విషయమయినది. పర్వతముల గుండా 1305 అడుగుల యెత్తుకు పరుగిడును. గుర్రము వేగమున గేలప్ తీయుచున్నపుడు స్వారి చేయువాడు వాలుగా వెనుకకు కూర్చుండినట్లు మేమును ముందునకు వంగినయెడల జారిపోదుమను భయముతో వెనుకకు తట్టి, బెంచీలపై కూర్చుండియుంటిమి. మధ్యమధ్య స్టేషనులున్నవి. ట్రాము ఆగుచుండును. ఆగినపుడుకూడ దాని పొజిషన్ నదిని దాటబోవు గుఱ్ఱము వలె ఏటవాలుగనె యుండును. ట్రాముకుపైని మామూలుగ ఎలక్ట్రిక్ తీగె యున్నది. కాని అడుగున వైర్‌రోప్‌చే లాగబడుచున్నది. చిట్టచివర

స్టేషన్‌లో నొక మెషీను ఈ త్రాడును చుట్టివేయుటయు, విప్పివేయుటయు జరిగించును. చుట్టివేయునపుడు ట్రాము కొండపైకి వచ్చును. విప్పివేయునపుడు కొండక్రిందకు బోవుచుండును. కొండక్రింద అనగా పట్టణములోకంటె కొండపైని 10 డిగ్రీలు చలువగానుండును. పైభాగమున తెల్లవారి యిండ్లేయున్నవి. కొండమీద చక్కనిబాటలు గలవు. కొండయొక్క శిఖరమునకు బోవుమార్గమున మేము వెళ్ళినాము. అది మెల్లగా నెతగుచు వంకరటింకరగ బోవుచున్నది, ఇరుప్రక్కల పర్వతములు పెట్టని గోడలవలె నున్నవి. అచ్చటచ్చట నొక దొరగారియిండ్లు, దాని చుట్టుప్రక్కల బట్లరుకు కుటీరము, అనతిదూరమున అమర్చిన టెన్నిసుస్థలము. చల్లనిగాలి, నిశ్శబ్దము, ఎటుజూచినను ప్రకృతిసౌందర్యము, మే మా బాటయొక్క తుదను చూచుటకని కొండల నెక్కియెక్కి విసిగితిమి. వెళ్ళగా వెళ్ళగా నొకచోట ఒక సిపాయి తుపాకి చేతంబూని షారా తిరుగుచున్నాడు. ఆ పెద్దగుమ్మమున కవతల నొక విశాలమగు బయలు గలదు. ఆ బయలుమధ్య గవర్నరుగారి దివ్యసౌధము. లోనికి నరమాత్రుని చొరనియరు బిల్డింగుత్రోవను వదలి దాని నంటియున్న యింకొకత్రోవను ఇంకను పైకిబోతిమి. అది యాపర్వతముయొక్క శిఖరమున, అచ్చట నొక పెద్దతుపాకి యున్నది. దానిప్రక్కనె వైరులెస్ స్తంభములున్నవి. దాని దాపునకు బోనెంచితిమి. కాని కొన్నిగజముల కేవల నొక బోర్డుమీద "ముందునకు సాగువారు శిక్షింపబడుదురు." అని యింగ్లీషున నుండుట జూచి అచటనె కొండొకవడి విశ్రాంతికొరకు కూర్చుంటిమి. ఆహా! ఆది యెట్టిదృశ్యము! పిల్లవాయువులు మమ్ము సేదదీర్చెను. ఎటుజూచినను పలు తెరంగులపూవులు, పలురకంబులచెట్లు, ఒక వంక నగాధమగులోయలు, ఇంకొకవంక చైనాసముద్రము, క్రిందనున్న యిండ్లన్నియు బొమ్మరిండ్లవలె గన్పించెను. పట్టణములోని విశాలమగు బాటలు చిన్నగీల్లవలె జూపట్టెను. మానవు లంగుష్ఠమాత్రులుగ గన్పట్టిరి. సముద్రములోని గొప్పయోడలు పిల్లలాడుకొను కాగితపు పడవలయ్యెను. ఆ కొండత్రోవను ఎక్కుచున్న కొలదిని శిఖరముకొర కెదురుచూచుచుంటిని. శిఖరమును చూడవలెనను నుత్సాహముతో నెక్కగలిగితిమి. శిఖరమును చూచినాము. కొంతసేపచ్చట సంతోషముగ గడపినాము. దిగిపోవలెనను బుద్ధి వొడమినది. ఇహ

సౌఖ్య మెంతటిదైన నంతయు దాని అంతును జూచిన వెనుక బుద్ధి మరలి పోవును. పరబ్రహ్మమును సాధించుయోగమార్గము. అట్టిదిగాదు చూడు. సాధించిన కొలదిని ఇంకను సాధింపవలెననెడి బుద్ధి. సాధించి బ్రహ్మమును కనుగొనిన వెనుక అందు లీనమగుటకే బుద్ధిపుట్టునుగాని తిరిగి తనచోటికి బోవుటకు బుద్ధిపొడమదు. ఈసంబంధమగు యూహలతో కాలమును పుచ్చుచు చీకటి పడకపూర్వమె కొండమీదనున్న ట్రామ్‌స్టేషనువరకు వచ్చినాము. ఇంతలో ట్రామ్‌కూడా సిద్ధముగా వచ్చినది. దానిపైనెక్కి కొద్దిసేపటిలో కొండయడుగునకు దిగినాము. అప్పుడప్పుడే పట్టణములోని లైట్లు వెలిగింపబడినవి.

---

## ౧౩

## చైనాలో భోజనము

రాత్రి, 11-5-29, హాంకాంగ్:—

ఒక చైనీస్ హోటలుకువెళ్ళి భోజనము చేసినాము. ఇచ్చట మాంసాహారము లెక్కువ. శాకాహారములు బహుస్వల్పము. మేము అన్నము రెండు ప్లేట్లును ఆకుపచ్చని బఠాణీలు ఒక ప్లేటును ఆర్డరుచేసినాము. ఆబఠాణీలలో ఇంత ఉప్పు మిరియాల పొడుమును కలిపి అన్నములో నంజుకొనితినినాము. వెన్నెనుముట్టుకొనలేదు. కొన్నిచోట్ల పందిక్రొవ్వును వెన్నవలెనుపయోగింతురు. లెమనేడ్ ఒక గ్లాసులో వేసి అందు రెండు కాగితపు గొట్టాలుంచి యిచ్చినాడు. గ్లాసును పెదవులతో నంటక ఆగొట్టములతో పీల్చుకొనుడని వాని యుద్దేశ్యము. అమెరికాలో గూడ నిదేయలవాటట. అందుచే నేను అట్లే పీల్చివేసినాను!

### నాటకములు

చైనావారి నాటకశాలకు త్రోవబట్టినాము. ఏనాటకమైనను ఈదేశములో అర్థరాత్రము దాటిన వెనుక ఆడనీయరు. అందుచే వీరు 8 గంటలకు ప్రారంభము చేతురు. పెద్దహాలు. దానినిండ తరగతులవారీ కుర్చీలు. విదేశ

సులమగ్న మమ్ము జూచి మా ప్రక్కనున్న చైనావారు నవ్వినారు ఎందుకు నవ్వినారో తెలియకయె మా స్నేహితుడును నవ్వినాడు. అదేమిటని అడుగగా, నాకంతే యన్నాడు!

మేము రాగానె ఎదుట అనేకరకముల తొనలను పండ్లను తేయాకు రసమును ఉంచినాడొకడు. అవన్నియు అమ్మకముకొరకు.

స్టేజీ తెరవేయుదురేమో అనుకొంటున్నాము. 9 గంటలయినది ప్రేక్షకులు పెద్దగోలచేయసాగిరి. తెర లుపయోగింపకయే నాటకము ప్రారంభించినారు. ఇరువది ముప్పది మంది ఆడవాళ్ళును మగవాళ్ళును చిత్ర చిత్ర వేషములను ధరించి స్టేజీమీదికి వచ్చినారు. స్టేజీలో గల్లుమని ఘంటల చప్పుడు నిరంతరము శంఖమువంటి ధ్వని, జేగంటల వాయింపు జోరుగా నుండెను. పురుషవేషధారులును స్త్రీవేషధారులును ఒక్కరొక్కరె స్టేజి ముందుకు వచ్చి మొదట సభ్యులకు నమస్కారములను చేతురు. వారు నమస్కారముచేయు పద్ధతి హిందూదేశ పద్ధతి నెంతమాత్రమును బోలియుండదు. తరువాత నందరును వరుసగా నిలుతురు. పురుషు లందరును గజమునకు తక్కువపొడుగులేని గడ్డములను కట్టుకొందురు. స్త్రీలందరును అంతకు తక్కువకాని జడలను ధరింతురు. అంతట వారు పురుషులును స్త్రీలును నాట్యమాడుదురు. చాలమంది వీపును సభ్యులపైపు కొంతకొంత సేపుంచుటను గమనించినాను. అది వారిలో తప్పు గాకపోయి యుండవచ్చును. నాట్య మాడియాడి వరుసగా నిలుతురు. ఇంతలో కొందరు గుఱ్ఱపు బొమ్మలను కట్టుకొనివచ్చి చిందులు త్రొక్కుదురు. కొందరు యువకులు సర్కస్‌లోవలె స్టేజిమీద ఇంగనుల గొట్టుదురు. కొంతసేపైనవెనుక అందరును కలసి స్టేజి యవతలకు బోదురు. తెరలు వేయుటగాని తీయుటగానియుండదు. ప్రతిసీను ఇదియేపంపిణి! మాకువిసుగెత్తి లేచిపోయినాము.

అమాయ్, చైనా, 13-5-29.

నేడు తెల్లవారిన కొలదిసేపటికి యీ రేవుపట్టణమును మాయోడ చేరినది ఇచ్చట నేడంతయును, రేపునుఆగి తరువాత జపాన్ దిశకు ఓడపోవును. చైనాదేశములో నింకెక్కడను నిలవము. జపాన్ చేరగనే నీకువ్రాయుదును.

నేను ఆరోగ్యముగను, క్షేమముగనుఉన్నాను. ఉత్తర దిశకు పోవుచున్న కొలదియు చలి యెక్కువగుచున్నది. డెక్ మీదకు పచార్లు చేయుటకు వచ్చుట కొందరు మానుకొనినారు. నేను సరిగనే యున్నాను. డెక్ మీద షికారు చేయుచునే యున్నాను. శీతలదేశములు నాకు వికటించవని యాశించుచున్నాను.

ఓడ ప్రయాణమైనను మితిలేకుండ దీర్ఘమైనపుడు కొంచెము విసువుగ నుండును. ఇంకను ఒకవారముకుగాని జపానులోని కోబేను చేరము. మా ఓడలో సందడి కొంచెముతగ్గినది. చాల మంది హాంకాంగ్‌లో దిగిపోయినారు. దొరసానులు పియానోమీద చక్కగా వాయించెడివారు. ఇప్పుడు వారందరు వెళ్లిపోయినారు. సెకండుక్లాసులో ఒక్క మిసెస్ఆరంస్ట్రాంగ్ తక్క నెవరును పియానో వచ్చినవారు లేరు. కాబట్టి చాలసేపు పుస్తకములతో కాలక్షేపము చేయుచున్నాను. వీలైనంతవరకు సత్సంగమును మానుటలేదు.

నీవును రామకృష్ణులును సౌఖ్యముగ నున్నారని నమ్మెదను. మనమిప్పుడు ఒండొరులము వేలకొలది మైళ్ల దూరములో నున్నాము కాని నీవును పరమాత్మను ధ్యానించుచుండుము. నేనును ధ్యానించుచుండెదను. అప్పుడు మనమిద్దరమును పరమాత్మ సన్నిధానమున చేరుచుందుము. అక్కడైనను దినమున కొకసారి మనము కలుసుకొనగలుగుచుందుము.

సరియైన యడ్రస్ లేకపోవుటచే, మీయుత్తరములను తెప్పించుకొనుటకు సావకాశము లేకున్నది. మీయుత్తరములను చూచుచుండుచో, ఇంకను ఆహ్లాదకరముగ నుండగలదు. అందరిమిత్రులకును నావందనములు.

సాయంత్రము 7 ఘం. 14—5—29

తా. క. ఈయుత్తరమును పూర్తి చేసిన తరువాత పోస్టులో వేయుటకుగాను ఓడ దిగుద మనుకొని నలుగురైదుగురు స్నేహితులతో కలసి బయలుదేరినాను. ఓడ గట్టుకు చేరలేదు. చిన్నచిన్న పడవలమీద గట్టుకు పోవలసియున్నది. మూడు చిన్నపడవలు మా యోడ నిచ్చెనమెట్ల అడుగున కనుపించినవి. అందులో నొకదానిపై కెక్కుటకు మేమందరము ప్రయత్నించినాము. అప్పుడు గాలి విస్తారముగ వీవజొచ్చెను. కెరటము లెక్కువగుచుండెను. చినుకు పట్టెను. ఆచిన్నపడవ క్రిందకు పైకి నాడుచుండెను. ఐనను కష్టముమీద ఒకరితరువాత నొకరము ఆపడవలో పడినాము. ఇంకను పడవ బయలుదేర నేలేదు; తెర యూగుచుండెను. నిముష నిముషమునకును వాన యెక్కువయైపోవుచుండెను. కెరటములు పెరిగిపోవుచుండెను. చలిగాలి తెగవీచెను. ఆచిన్నపడవ బొమ్మవలె క్రిందకు మీదకు నాడుటెక్కువయ్యెను. నాకు డోకులువచ్చు సూచన యగుపడెను. అంతట నేను మెల్లగా ఆచిన్న పడవమీదనుండి మాయోడ మెట్లనిచ్చెన వద్దకెక్కి తిరిగి యోడమీదికి వచ్చివేసితిని.

తరువాత నెన్నిసార్లు ప్రయత్నించినను గట్టుకుపోవుట పడినదికాదు. ఈయోడలో సెకండుక్లాసులో కొందరు ఒంగ్రేతువాండ్లున్నారు, వారు ఎవరికిని తెలియకుండా గట్టుకుబోయి వచ్చుచుందురు. కొందరు రెండవసారి వెళ్లుట కిష్టపడలేదు. ఒంటరిగ నేను వెళ్ళుట మంచిదికాదని మాఓడలోని స్టూవర్డు చెప్పినాడు. చీనాలో లెక్కలేని బీదజనులున్నారు. వారికుచ్ఛనీచము లుండవు. వీరైతే మాబోటి పరాయిదేశస్థులను ఒంటరిగజూచి సొమ్ముకొరకెంతపని చేయుటకైనను జంకరనిరూఢిగ తెలియవచ్చినది. అందుచే ఈ యుత్తరమును జపానునుండి పంపవలసి వచ్చినది.



టాల్మాయోడ, ఉదయం 17-5-29:—

నిన్నటి దినమంతయు సముద్రుడు ఉగ్రుడైనాడు. వరుణుడును వాయుదేవుడుకూడ కినిసిరి చలి గడగడ వణకించెను. ఓడ బొమ్మ్రవలెనాడిపోయెను. ఆకుదుపుమూలమున నాకు డోకులు వచ్చెను. నిన్న ఉదయం ఈ కుదుపు నన్నేమి చేయునని మొండి చొరవచేసి, కొద్దిగా భోజనము చేసినాను. క్రమేణా కుదుపు ఎక్కువయ్యెను వికారము మీరిపోవుచుండెను. మధ్యాహ్నముగాని రాత్రిగాని భోజనము చేయలేను. డోకులు మొదలయ్యెను. భోజనవేళ కాగానే పెద్దగంటవాయింతురు. ఆ గంట నాకొకవేళ వినపడక రాలేదేమోననుకొని మా కేబిన్ బోయ్ గంట యిచ్చినారండి అనినాడు. నాకు వినపడినది. కాని వికారముగ నున్నది అన్నాను. సాయంత్రము తిరిగి వచ్చినాడు. గంట వినిపించినది. ఏమిచేయను. డోకులు ఎక్కువగనున్నవి. రాలేను. అన్నాను. రాత్రి నాకు నిద్ర సరిగా పట్టలేదు నా బెర్తుకు క్రిందను ఒక ప్రక్కన నాతువ్వాలు పడవేసి దానిలో ఉమియుచుండెడి వాడను. వాష్ బేసిన్ వద్దకు వెళ్ల లేక ఈపనిచేయుచుంటిని. జాగ్రతావస్థలో నున్నంతసేపును రాధాస్వామీ దయాళుని ప్రార్థించుచుంటిని. నేడు తెల్లవారినది. కుదుపు నిన్నటికంటె కొంచెము తగ్గినట్లు కనుపించుచున్నది. కొంచెము వికారము తగ్గుచున్నట్లున్నది. వాంతులు రాలేదు, కాని యింకనూకట్టలేదు.

మధ్యాహ్నము 17-5-29.—

ఉమ్మి కట్టకపోయినను వికారము కొంచెము అణగియుంటచే నా మనస్సు కొంచెము సిమితముగానున్నది. కొద్దిగా చమువ గలుగుచున్నాను. ఉదయముగాని ఈపూటగాని తిరిగి భోజనముచేయలేదు. ఇంకను ఆకలి యగుటలేదు. అన్నితలుపులును మూసియుంచినను చలిమిక్కుటముగనున్నది.

రాత్రి 17-5-29:—

కొంచెము ఆకలియగుచున్నది. దీర్ఘ లంఘణములు కట్టినచో ట్రీట్మెంటు చేయించుకొనుటకుగూడ సరియైన డాక్టరు లేడు. ఈ యోడలో నొక

డాక్టరు జీతము పుచ్చుకొని ఉంటున్నాడనిన మాటయేకాని ఇన్ని పూటల నుండి నేనాహారమును తీసికొనక కేబిన్ బయటకుపోక నా బెర్తుమీదనె కూర్చుండుచు పరుండుచు పడియున్నను నన్నొకసారియైనను పలుకరించలేదు. మన నారాయణ ఈనాసిక్‌లో అనేకసారులు జ్ఞాపకము వచ్చుచున్నాడు. మా నాన్నగారు మమ్ము విస్తారముగ ప్రేమించెడివారు. అయితే ఆయన ప్రేమ మాకు తెలియనిరోజుళ్లలో కఠినతరకముగ కనుపించెడిది. ఏలనన మావిద్యాబుద్ధుల విషయములో మా నాన్నగారుచాల జాగ్రత్తవహించెడివారు. మా నాన్నగారికి గొప్ప స్నేహితుడైయుండెను. నారాయణ ఆయనమీదగల ప్రేమను మాపైయాతడు చూపుచుండెను. ఆ ప్రేమకూడ మాకుచిన్నతనములో కఠినతరకముగనె తోచుచుండెను. ఏలనన మాశరీరారోగ్యమె నారాయణ ప్రధానముగ నెంచుకొనుచుండెను. అందుచె మాకుజబ్బుచేసినపుడు సాగదీసి లంకణములను కట్టుచుండెను, చిరుతప్రాయమున కఠినముగ దోచినవారిద్దర ప్రేమలును పరిశుద్ధప్రేమలని పెద్దయెదిగిన తరువాత మాకుతోచినది. నారాయణది ఇప్పటికిని ఎప్పటికిని గట్టిలంఘనమె. పద్ధతి అపద్ధతికి యలవాటు పడిననేను (నారాయణ ఇక్కడ నున్నచో) గట్టిలంఘనమును ఒప్పుకొని యుందును. నా ప్రాణమునకు సున్నితముగ నాతడు వైద్యము చేసియుండును. నన్నే నిమిషమునను విడువక రుచికరములయిన వాక్కులచే ప్రేమ ధారలను నాపై గురుపుచు బాధ యెవరిదో యనిపించియుండును. అంతటి భాగ్యము ఇంతదూరమున నున్న నాకు లభింపజాలదు. అందుచే ఘట్టిలంఘనము కట్టినచో ట్రీట్మెంటు కొరతయగుననే భయముచేత వేడికాఫీయును ఒకటిరెండు రొట్టెముక్కలను అనగా (బ్రెడ్) యిప్పుడే పుచ్చుకొనినాను, ఈరాత్రి చక్కగా నిద్రపట్టవచ్చునని యాశించుచున్నాను.

మే 18:—

గతరాత్రి నాకు నిద్రపట్టినది తెల్లవారినది. నాకు చాల తేలికగ నున్నది. సముద్రము నిన్నటికంటెను కొంచెము శాంతముగ నున్నది. నేడు యెండకూడ వచ్చినది. ఒకగిన్నెడు వేడికాఫీయును ఒక స్లెయిస్ బ్రెడ్ ను పుచ్చుకొన్నాను. వున్ని సూట్ వేసికొని, కేబిన్ బయటకు పోయినాను, అరంస్ట్రాంగ్ సతి నన్నుచూచి "ఎట్లున్నది, సీసిక్నెస్ వచ్చినదా, జడియలేదు

# భూప్రదక్షిణకుడు భార్యకు వ్రాసిన లేఖలు.

దా నాయనా" యనినది. ఆరంస్ట్రాంగ్ దొర నన్నుచూచి "మొన్నటి దినమంతయు నేనును మీవలెనే సీసిక్నెస్‌తో పడియుంటిని" అన్నాడు. నేను సుమారు రెండు గంటలసేపు గాలివిసురు తక్కువగానున్న వైపున యెండలో నెమ్మదిగా పచార్లుచేయుచు గడపినాను. ఏమియెండ? వానకాలపు యెండవలె మబ్బులచాటునుండి వచ్చుకిరణములు! మధ్యాహ్నము తిరిగి వేడికాఫీ పుచ్చుకొన్నాను. కొంచెము పుష్టిచేరినది. చాలసేపు రీడింగు హాలులో గడపినాను. ఉదయముకంటె హుషారుగా పచార్లు చేయుచున్నాను. చాలసేపు చదివినాను. కొంతసేపు పియానోవినుచు కూర్చున్నాను. జపాన్ సముద్రములో చలిబాధ చాలయెక్కువగనే యున్నది. చేతులు వంకరలు పోవుచున్నవి. ఆరిచేతులు మంచుగడ్డవలెనున్నవి. అందరును ఉన్నిగుడ్డలనే ధరించియున్నారు.

రాత్రి 8 గంటలకు 18-5-29:—

ఈ సాయంకాలమునకు నాకుపూర్తిగ సత్తువకలిగినది. సత్తువ చేరిన కొలదియు చలియొక్క ప్రభావము తగ్గుచున్నది. వేడికాఫీ తిరిగి పుచ్చుకొనినాను. నేనిప్పుడు తిరిగి సంతోషముగనున్నాను. నామామూలు ప్రాణాయామమును గూడ ఆనందముగను సునాయాసముగను చేసికొనగలిగినాను. భగవత్ప్రార్థనయు పూర్తిచేసికొనినాను. ఇంక నిద్రకు వెళ్ళుచున్నాను.

ఇప్పుడిప్పుడే ఓడ మోజీపట్టణమునుచేరుకొన్నది. కాని ఉదయమునగాని డాక్టరురాడు. అందుచేత ఉదయము డాక్టరువచ్చి మామూలు విజిటు ఇయ్యగానే ఒకసారి పట్టణములోకి చూడబోయెదము. ఈ యుత్తరము మోజీ పోస్టాఫీస్‌లో వేయదలంచినాను.



షిమనోసాకి, జపాన్, సెప్టంబరు 19:——

తెల్లవారుచుండెను. డాక్టరువచ్చినాడు, జపాన్‌వారి పాస్‌పోర్ట్ ఆఫీసరు వచ్చినాడు. ఆయన సిబ్బంది వచ్చినది. ఎవరిపని వారు చేసుకొని వెళ్ళినారు. ఇదంతయునయ్యుసరికి 9 గంటలకు దాటినది.

ప్రాతఃకాలభోజనముచేసి, డెక్ మీదకు బోయిచూడ, కప్పులేని తొట్టిపడవలో జపాన్ కార్మికులు స్త్రీలును, పురుషులును ఒకరికొకరు పదేసి అడుగుల దూరమున నిలబడి బొగ్గును తట్టలతో నొకరిచేతులలో నుండి మరియొకరి చేతులలోని కెగురవేసుకొనుచు, మెల్ల మెల్లగ మాయోడలోనికి జేర్చుచుండిరి. కొన్నిగంటలలో వీరు పడవలకొలది రాక్షసిబొగ్గును తట్టలలోనికి, గొట్టి మోసివేసియుండిరి. జపానీయులు బలకాయులు. వారు పనిచేయునపుడు అతిశ్రద్ధగా పనిచేతురు. ఇంతమందిజనములో నొకరి ముఖమందైన నిర్లక్ష్యభావము గోచరించలేదు.

వారందరును రబ్బరుజోళ్లను కాళ్ళకు ధరించియుండిరి. ఆజోళ్లుమనవారి జోళ్ళవలెనులేవు. కాలిబొటనవ్రేళ్లు అమర్చుకొనుటకు వీలుగా అరవలె నిండేర్పాటుండును. వారి హేట్ ఒకరకపుగడ్డితో తయారు చేయబడినదట. ప్రతివానితలను ఒక హేట్ గలదు. వంగిలేచుచుండునపుడది జారిపడకుండ నొకత్రాడుతో దానిని తన గడ్డము క్రిందనుండి లాగి కట్టును.

ఓడలో క్రింద డెక్ మీద నెటజూచినను జపానీయుల దుకాణములె. ఈ దుకాణదారులలో కొంతమంది స్త్రీలు. కొంతమంది పురుషులు. ఆ దుకాణములలో రకరకముల చిత్రవస్తువుల నమ్ముదురు. అందుకొన్ని యుపయోగకరములు, కొన్నివినోద జనితములు మాత్రమె. ఏవిధముగ కొనువారి నాకర్షించవలెనో, అట్లేవారి నాకర్షింపగలిగి, ఈ దుకాణదారులు కొను వారి జేబులను ఖాళీ జేయించుచున్నారు. వీరుఏదేశపు ప్రయాణికులతో ఆ భాషను మాటాడి, వచ్చిరాని మాటలతో నవ్వింతురు.

# ౧౭

## జపాన్ దేశము.

షిమానొసాకీపట్టణము, సెప్టెంబరు 19:—

మా యోడచుట్టును చిన్న చిన్న స్టీమ్‌లాంచి లున్నవి. ఓడనుండి పట్టణమునకు ప్రయాణీకులను గొంపోయి, మరల ఓడను జేర్చుటకవి జపాన్ వారిచే నేర్పాటు చేయబడినవి. నికానో అనునొక జపాను స్నేహితుడును నేనును కలసి యొకస్టీంలాంచిపై నెక్కి 5, 6 నిమిషములలో షిమనొసాకీ పట్టణమును చూడవచ్చితిమి. దీని జనాభా ఏబదివేలట. అన్ని రోడ్లును కంకరచేయబడినవే. కాని అది యెట్టికంకరయో, రోడ్‌పై రెండంగుళము లకు తక్కువకాని కంకర రొచ్చు ఏర్పడియున్నది. మా కాలిజోళ్ళకట తగిలి లసలసలాడునపుడు చీదరగ నుండెను. మోటారుకారులకును, బస్‌లకును కొదువలేదు. అవి పరుగిడునపుడు త్రోవలో నున్నవారు, కంకర బురద చిందునని ప్రక్కనున్న షాపులలోనికి పరుగిడుచుండిరి. జపానువారికి నవ్వెక్కువ. అట్లుపరుగిడువారినిజూచి వారు పకపక నవ్వుచుందురు. ఎట్టి విషమపరిస్థితులందైన రవ్వంత చిత్రముగ దోచెనేని జపానీయులకు నవ్వు వచ్చుచునే యుండుననియు, కష్టములు మెండైనకొలది వారికి ధైర్యము తాగ్రిడుచాయుటయె కాని విచారమెట్టిదో కలుగదనియు నికానో చెప్పినాడు.

వీథులలో ట్రాములు ఇటట్టే తిరుగుచుండును. ఒకట్రాంపై నెక్కి యనేకవీథులను చూచినాము. మొత్తముమీద జపానీయులలో మెచ్చుకొనదగిన విషయము—వారి నిశ్శబ్దత. జనసంకీర్ణమయిన వారివీథులు నిశ్శబ్దముగ నుండును.

పోస్టాఫీసు యెక్కడో వాకబుచేసి, ఉత్తరములు వేయుటకును పోస్టుబిళ్ళలను కొనుక్కొనుటకును వెళ్లితిమి. అది వీధి నంటియుండలేదు. దానియెదుట కొంత విశాలస్థలముగలదు. పార్సిల్స్ ఎన్క్వాయరీస్ అను పదములను ఆయాగదులవద్ద ఇంగ్లీషునను వారి స్వభాషలోను వ్రాసినారు. ఈపోస్టాఫీసులో ఉత్తరములు వ్రాసుకొనువారి సౌకర్యార్థము కుర్చీలు,

బెంచీలు, మేజాబల్లలు, సిరాబుడ్లు, కలములు, అద్దుపేపర్లు గలవు. ఇట్లే ప్రతి జపాన్ పోస్టుఆఫీసులోను ఉండునని నిశానో చెప్పినాడు.

స్టాంపులమ్మెచోట ఆడపిల్లలున్నారు. వారు స్టాంపులమ్ముటకు లైసెన్సు పొందినవారట. నేను స్టాంపు లంటించుచున్నాను, నాచేతిలోని యుత్తరములను లాగుకొని నన్నుచూచుచు నవ్వుచు మరల చూచుచు మరల నవ్వుచు ఈవిధముగ అంటించిపెట్టి, మిగిలిన బిళ్ళలను నాచేతిలోనున్న మణిపర్సులోపెట్టి, పోస్టుబాక్సులో వేయమన్నారా అని నన్నడిగిరి. వేయమన్నాను. వేసిరి "తేంక్యూ" అన్నాను. వారు మర్యాదసూచకముగ నడుములు వంచిరి.

వారిజుట్టు, కట్టు మొదలగునవి తమాషగా నుండును. వారివి దీర్ఘకేశములు. రోజము లనుటకు వీలులేదు. వారిజుట్టు ననేక రకములుగ విరిచి, మవ్వైనల సహాయమున దాని నడుపులో నుంచుకొందురు. వీరి తలనిండ మవ్వైనలే! వీరు కట్టునది కిమానో. చాల లూజ్ గా నుండును. ఇదియొక గౌనువంటిదగును. స్త్రీలు కిమానో ధరింతురు. పురుషుడు ధరించునదియు కిమానో! వీరిలో గేడా లనబడు యొకరకమగు చెప్పులను స్త్రీ పురుషు లందరును వాడుదురు.

జపానీయులలో స్త్రీలకుగూడ పురుషులవలెనే స్వేచ్ఛకలదు. అన్ని వీధులందును స్త్రీ పురుషులు కలసి నడచిపోవుచున్నారు.

వీరు మమ్ముజూచి నవ్వుకొనుచుండిరి.వారినవ్వునకు హేతువేమని నిశానో నడిగితిని. "నీవే" యన్నాడు! వారందరును మంగోలియనులు. నేను ఆర్యుడను. నా స్వరూపమునకును వారి స్వరూపమునకును హాసిమశకాంతరము తేడాగలదు. నన్ను తేరబారిచూచుటయే వారు పనిగా బెట్టుకొనినట్లగుపడినది! ఏవీధికిబోయిన నిదియే యనుభవము! "వీరికి విసుగైనాలేదా" యనుకొనుచున్నాను. నన్ను తేరబారిచూచుట, వారొకరితో నొకరు నవ్వుకొనుట!

వారికండ్లు చింతాకులవలె నతి చిన్నవి. ముక్కులు తప్పడ. ముఖములు తడి శిబ్బెలవలె గుండ్రముగ నుండును. వారందరును పొట్టివారు. కాని బలశాలురు. చామనచాయవారు కొందరును, ఎర్రని రంగువారు కొం

దరును, చాల శ్వేతవర్ణమును గలిగి కొందరును గలరు. ప్రతి పురుషుడును బోడిగుండును చేసుకొనును: ఎచ్చటనోగాని క్రాపింగుతలలను గానము. ప్రతి జపాన్ తల్లియు తనసంతానము నొకగుడ్డలోకట్టి వీపున బిగించుకొని వీధులవెంట తిరుగుట గలదు.

ఒకవీధిలో షింటోగుడిగలదు. ఈ షింటోగుడిలో జపానీయుల పెద్దలను పూడ్చిపెట్టుదురు. కొందరికి గోరీలను కట్టెదరు. మరి కొందరికి ఏదోయొక రాతిని నిలబెట్టియుందురు. ఈ గుడిలోనికి వందలకొలది జపానీయులు వచ్చుచు బోవుచు నుందురు. అందరికిని తమపూర్వులయెడ భక్తి హెచ్చుట. అందుచే వారు మోకాళ్ళపై నిలబడి, వారిపూర్వులను స్మరించుచుందురు.

వీరి బౌద్ధాలయమునుగూడ చూచినాము. బుద్ధ భగవానుని విగ్రహములకు కొదువలేదు. ఈయాలయములో బౌద్ధసన్యాసులకును కొదువలేదు.

జపానీయులలో ననేకులు క్రైస్తునారాధించెదరట. కాని జపానీయుడు తాను షింటోమతమునకు చెందినను, బౌద్ధమతమునకు చెందినను క్రైస్తవమతమునకు చెందినను తాను మొదట జపానీయుడనియే జ్ఞప్తియందుంచుకొనును. వారిలోమత సంబంధమైన కలహములులేవు. జపానీయులందరును తమజాతియనిన గర్వించుకొనుచుందురు.

జపానుయువతు లన్ని వృత్తులయందును ఉన్నారని తెలియుచున్నది నికానోయును నేనును ఒకషేవింగ్ సాలూనులో ప్రవేశించినాము. ఆతనికి క్రాపింగును చేసినదొక జపానుయువతి. నన్నును చేయించుకొమ్మనినాడు. కాని నేనుసిగ్గుపడి చేయించుకొనలేదు!

ఈ వీధిని కొందరు యువకులు పరువులిడుచున్నారు. అందరిదిని ఒకతే మసు. ప్రతిమసుపైనను నంబరు వేయబడియున్నది. ఏ రేవీధులగుండ పరుగిడుదురో ఏగంటలగాయితు ఏగంటవరకుపరుగిడెదరో ముందుగనే ఆయా వీధులలో చాటింపువేయబడెనట. అందుచే నాయావీధులందు ట్రాఫిక్ (అనగా రహదార్) యాగిపోయినది. ఈచివరనుండియు ఆచివరనుండియు మనుష్యులు మాత్రమే నడచుచున్నారు. అపరుగులతో గెలుపొందువారికి

మునిసిపాలిటీవారు బహుమానము లొసంగుదురట. గెలుపొందిన వారిని యూరేగింతురట!

మేము లాంచిరేవుకు బోవుత్రోవలో నొక చేపల బజారున్నది. స్వరూపములందును. ఉరవలందును, రంగులందును ఆ చేపలు చిత్రముగ నున్నవి. ఇందొక్కటియైన ఇంతవర కేదేశ మందును నేనుచూచియుండలేదు.

మా లాంచికి దగ్గరగ ననేక లాంచిలున్నవి. అందొకలాంచిలోనికి నల్లని యూనిఫారమును తొడుగుకొని లండనుపోలీసువారు పెట్టుకొందు రని నేను పుస్తకములలో చదివిన వర్ణనగల టోపీలను పెట్టుకొని కొందరు యువకులు ఎక్కుచున్నారు. "చూచితివా, ఈ లండను పోలీసును! వీరంద రును స్కూలుబాలురు. జపానులో నేస్కూలుబాలునికిని యిదియే డ్రస్! అనెను నికానో.

మరల మేము యోడజేరుసరికి 12 గంటలయినది. భోజనమునకు గంట వాయించినారు!



# ౧౮

## జపాను దేశము.

మోజీపట్టణము, మే 19:—

మధ్యాహ్నము భోజనానంతర మొకింతసేపు విశ్రమించి మోజీపట్టణము చూచుట కేగితిమి.

మాయోడ షిమానోసాకీ పట్టణమునకును మోజీపట్టణమునకును మధ్య గల జలసంధియందు నిలచియున్నది. మాయోడచుట్టును నిలబడి ప్రయాణీకులను షిమానోసాకీకిని మోజీకిని గొంపోవులాంచీలలో నొకదాని మీద నెక్కి మోజీపట్టణమునకు వచ్చియుంటిమి.

మోజీపట్టణమందు రాక్షసిబొగ్గుపరిమితము. ఈ జలసంధిగుండ బోవు ప్రతిదేశపు యోడకును ఈ బొగ్గిచ్చట సరఫరా యగుచుండును.

మోజీకిబోవుచు నోడమీదనె మూడురూపాయిలను జపానుదేశపు యన్‌లలోనికిని సెన్‌లలోనికిని మార్చుకొనినాము. ఈ యనుయొక్క ధర రూపాయిన్నర. ఈ ధర పెరుగుటయు తరుగుటయు గలదు. 100 సెన్‌లు కలసి యొక యను అగును. చైనాలో నే వీధిని చూచినను మారకపు మకాణములు కలవు. ఈమారకపు వర్తకమునందు చైనావారికున్న శ్రద్ధ జపానీయులకు లేమకాబోలు. మోజీలో మారకపు అంగళ్ళరుదు.

షిమానోసాకీలోని రోడ్లకంటె నిచ్చటిరోడ్లెక్కువ శుభ్రముగ నున్నవి. ఆరోడ్లపై జపానీయులు గేటాలను పాదములకు ధరించి, టక్ టికుమను ధ్వనులతో పోవుచున్నారు. జపానీయులకు స్వతస్సిద్ధమగు నిశ్శబ్దత యీ గేటాలచప్పుడే లేనియెడల రాజ్యముచేసియుండెడిది.

మోజీపట్టణము పూర్వపు జపానును జపికిదెచ్చు కొన్నిలక్షణములను కలిగియున్నది. పురాతన పద్ధతిని నిర్మాణమొనర్చిన పడవలొక కాలువలో లెక్కకుమించి పడియున్నవి. అవులచే వారు మోటబండ్లను లాగించుటయు నొకటిరెండు వీధులలో చూచుట తటసించినది.

జపానీయులలో నొకరికొకరు సలాము చేసుకొనుపద్ధతి చిత్రము. ఒక స్త్రీ ట్రాముదిగినది. మరొక స్త్రీ త్రోవను బోవుచు నీమెను జూచి, యొక్కింత నిలిచి సంభాషించెను. సంభాషణానంతరము ఒకరికెదురుగ మరియొకరు నిలబడి నడుములు పూర్తిగ వంచిరి! యిదియే వారిలో సలాము.

జపానీయులు చిత్రకళానురక్తులు. ఒకహోటల్ లో, ప్రవేశించితిమి. అటనొక చెర్రీచెట్టుకలదు. ఫలపుష్పములతో ప్రేక్షకుల కత్యంత ఆకర్షవంతముగ నున్నది; చెర్రీపువ్వులను కోయవలెననుకొంటిని. కాని యా చెట్టంతయు కల్పితమె! ఎంత స్వాభావసిద్ధముగ దీనిని కట్టిరి.

ఫలములును, పుష్పములును ఈజాతికి జాలనిష్టమట. పట్టణమున పెద్దపెద్ద పండ్లషాపులు కలవు. ఎన్నిరకముల పండ్లైనని యిందుదొరకును. కాని బేరములులేవు. కావలసినది పుచ్చుకొనుట చెప్పినధర యిచ్చుకొనుట!

చెర్రీ పండ్లను కొనుక్కొని తిరుగ లాంచికి వచ్చినాము. ఎంతవరకు నా మొగము కనబడునో, అంతవరకు చూచుటయె. తెరబారిచూచుట తప్ప నిరైన లేమ. మరల కనబడునో లేదోయని యాతుర్దాగా చూచుటయె. చూచుట, వారిలోవారు నవ్వుకొనుట. ఈమంగోలియనులకు ఆర్యుని శరీర లక్షణములు వింతగనున్నవి.

# ౧౬

## జపాన్ దేశము.

కోబేనగరము, నవంబరు 25:—

మాటాల్మాయోడలో నొక నోటీసు తగిలించినారు. మారలు యోడ ఎన్నిగంటలకు ప్రయాణము సాగించునో అందరకును తెలిసినది. అందుచే ఓడ కిరుప్రక్కలనున్న మోజీ, షిమనోసాకీ పట్టణములకు లాంచీలమీద షికార్లు ఆపివేసినారు.

సూర్యభగవాను డస్తమించి చీకటిమయమైపోయినపుడుతక్క కన్నులున్నవారు మూసుకొనియుండజాలరు. మాయోడ జపాన్ దేశపుయొడ్డున కనతిదూరమునుండి నడచునపుడు గాంచిన ప్రకృతిసౌందర్యము నెవడు వర్ణింపగలడు? మోజీనుండి కోబేవరకును ఒకటేయందము ప్రకృతిమాత తన లావణ్యారాశిని జపాన్ దేశపు గట్టున వందలకొలది మైళ్లు పరచివయిచెను. భూకంపములతోను అగ్నిపర్వతములతోను భయమునుగొల్పు జపాను తన రమణీయకతచే ముదమును గూర్చుచున్నది.

కోబేయోడరేవు నాలుగైదుమైళ్ళున్నదనగనే జపానువారి స్టీంలాంచీలు స్వాగతమిచ్చుటకోయన నెదురువచ్చె పిల్లతల్లిని చేయిపట్టుకొని తీసుకొనిపెళ్ళినట్లు తిన్నగా రేవునకుకొంపోవసాగెను. జపాను వారి యోడరేవులను పరదేశపుటోడలు జపానువారి సహాయము లేక సమీపింపనేరవు. ఏలనన ఒక్కొకచోట నగాధమగులోతు మరొక్కొక్కచో లోతుచాలదు. ఈగుఱుతులు జపానీయులకే తెలియును.

ఇమిగ్రేషను ఉద్యోగులును, డాక్టరును ఒకచిన్న స్టీంలాంచీలోనుండి టాల్మాలోని కెక్కిరి. మొదట ఫస్టుక్లాస్ ప్రయాణీకులను పరీక్షించిరి. తరువాత సెకండ్ క్లాసులో నున్న మమ్మందరిని పిలిపించిరి. పాస్పోర్టులను సరిచేసికొనినారు. డాక్టరు మమ్ములనుచూచి "యస్" అనినాడు.

ఓడ పియర్ను దరిజేరుసరికే పియర్ మీద ఆనందమోహాన్ సహాయ్ గారును, గుప్తాగారును. పి, యం. మాస్టరుగారును నాకొరకు వైకి జూ

చుచుండిరి. నారాకనుగూర్చి వీరి కింతకుమున్నె యుత్తరములు వచ్చియుండెను. ఓడమీద నాచెంతను నిలబడియుండిన సేన్ గారు తమ బంధువగు సహాయ్ గారికి "వీరే మా మిత్రిగారు" అని పరిచయ మొనర్చిరి. ఇంతలో నా సూట్‌కేసులు క్రిందకు దిగినవి. ఒక పొడుగుపాటి బండిని ఒక జపానీయుడు ముందున్ను మరియొకడు వెనుకను పట్టి తెచ్చి అందు నాసామానుల నెక్కించుకొనుచుండిరి. నేను ఓడదిగిరాగానే సహాయ్, గుప్తా, మా సరుగార్లు నాకరస్పర్శన మొనర్చి మోటారులో నెక్కించుకొనిరి. "మన మిప్పుడు సుంకములు విధించు ఆఫీసునకు పోయి వేచెదము" అనిరి. "కాని, ఆ సామానులన్నియు సరిగా నచ్చోటుకు వచ్చునను పూచీయేది?" అంటిని. వారు సగమునవ్వుతో 'ఇది జపాన్, దొంగతనములకు పాల్పడరు. వీరు ఇతర దేశములందలి కొందరి కూలీలవలె నీచులుకారు" అనిరి.

కష్టమ్సు హౌస్ వారు మాపెట్టెల నన్నిటిని తెరపించి, పన్ను విధింపదగిన వస్తువులందేమైననున్న వేమో చూచుకొనిరి.

తదుపరి కారులో మరల ముందుకుసాగితిమి. ఈ రోడ్లు మోజీరోడ్లకన్న బాగుగనున్నవి. ఈపట్టణము మోజీపట్టణముకన్న విశాలమైనది కనుక పట్టినది, అంతకన్న ఎక్కువ ప్రాముఖ్యతగలది.

గుప్తాగారి షాపు గుప్తాగారి ఇల్లునొకటియే. ఆయనషాపులో నొక జపానీయుడు గుమాస్తాగానున్నాడు. ఆయనయింటనొక జపాన్ యువతి వంటకత్తెగా నున్నది. ఆమెపేరు హీజా. ఆమెకు పరిచయ మొనర్చినారు. ఆమె మాకు మోజాబల్లపై భోజనములను వడ్డించెను. కాని నేను కేవలము శాకాహారినని తెలిసి, నాకుకావలసిన యాహారము తాను లభింపజేయగలనో లేదోయని తటపటాయించెను. గుప్తాగారి కోరికమీద నాకొరకామె యన్నమును పుప్పుతోకలిపి తెచ్చెను. జపాన్‌లో నందరును గ్యాస్‌పొయ్యిలమీద వంటచేసుకొందురు. అందుచే వారు వంట కొరకు దినమునకు కొన్ని నిమిషములు మాత్రమే ఖర్చు పెట్టుదురు.

# ౨౦

## జపాను దేశము

కోబేనగరము 25-5-1929.

కోబేనగరము జపాన్ దేశమున గల ముఖ్యనగరములలో నొకటి. దాని జనాభా ఏడులక్షలు. ఒకప్పుడు యోకహామానగర మీనగరముకన్న నెక్కువ ప్రాముఖ్యముగ నుండెను. కాని భూకంపము యోకహామాను పాడుచేసెను. నాటనుండియు కోబేయొక్క స్థితి యభివృద్ధి నొందెను. జపాన్ పరిశ్రమల కాకరమగు ఒసాకా నగరము దీని కనతి దూరముననే గలదు. ఒసాకా పరిశ్రమలలో పైకి వచ్చినకొలదిని కోబేయోడరేవుకు పని యెక్కువయ్యెను. ఇప్పుడు జపాన్‌లో కోబేకంటె గొప్పదగు నోడరేవు లేనేలేదు. ఎంతటి యోడకైనను ఈరేవునందు దధముపక్షము 24 గంట లయిన నాగకుండ కదలదు.

ఇదియుంగాక. జపాన్‌లో నింతకన్న శుభ్రమైనట్టియు,ఆరోగ్యకర మైనట్టియు నగర మింకొకటిలేదని ప్రతీతి.

చూచుటకుగూడ ఆనందకరముగ నుండును. కోబే కొకప్రక్కను పర్వతములు కలవు. అవియును పచ్చని చెట్లతో, జెల్లుమనుపారు కొండధార లతో నలరారుచుండును. ఆకొండలలో నెతుతెక్కువ వానివరకు చక్కని రోడ్లు వేయబడియున్నవి. కోబేలోని పర్వతపంక్తులనుండి సముద్రమును వీక్షించుచుండు టొకకన్నులపండుగు.

నగరమం దచ్చటచ్చట వినోదారము నాట్యగృహములు నిర్మింప బడినవి. ఈ నాట్యగృహములను "గుయిషా హౌసెస్" అందురు. ఇంతకు మున్ను జపాన్ యువతులు గుడ్డలువిప్పి నాట్యము చేయుచుండిరి. ఇది జపాన్ దొరతనమువారికి గిట్టనందున దిగంబరులైన నాట్యకత్తెలకు జుల్మానా వేయసాగిరి! అందుచేనిపుడు జపాన్ స్త్రీలు నవీనపద్ధతుల ననుసరించి నృత్యము సేతురు.

కోబేలో గొప్ప నాటకశాలలుగలవు. ఈశాలలు వినోదములతో నిండియున్నవి. ఇచ్చటనే స్నానములకు నేర్పాటు, భోజనములకు నేర్పాటు

ఇచ్చటనే మిఠాయిషాపులు. పానీయముల షాపులు, ఇచ్చట కసరత్తుకునే షాపులు, ఈతకు కృత్రిమతటాకములు, పిన్నలనక పెద్దలనక స్త్రీలనక పురుషులనక జనము సాయంకాలము మొదలుగ చాలరాత్రియగువరకు నుందురు. మాస్టరుగారు గుప్తాగారు నేనును కలసి నాటకమున కేగియుంటిమి. మొదట జపాను దేశమందలి పూర్వాచారమును తెలుపు నొకప్రదర్శనమును గావించిరి. ఒకడు దొంగలబాధపడలేక తనకుమార్తె నాదొంగల కర్పించును. తరువాత షేక్సుపియర్ మహాకవి రచించిన నాటకమగు "ఒథెల్లో"ను ప్రదర్శించిరి. చాల నేర్పును గనుబరచిరి. ఈ "ఒథెల్లో"ను జపాను భాషలోనికి తర్జుమాచేసిరి. చైనాలోని నాటకములందు రొదఎక్కువ అభినయమునున్న ప్లాట్ లేదు, జపానువారి నాటకములు స్వాభావసిద్ధమగుధ్వనితో గూడియుండును. అభినయమునకు లోటులేదు. ప్లాట్ గలదు.

కోబేలో ముఖ్యముగ చూడదగినవి చాలగలవు. అన్నింటిని నాకు చూపవలెనని మాస్టరుగారికి కుతూహలము. నునొబికి కొండధారల కేగితిమి. చూడదగిన దృశ్యము షింటోగుడియు చూడదగినదె. చాలపెద్దది. బుద్ధదేవాలయ మందలి బుద్ధవిగ్రహము యొక్క యెత్తు 47 అడుగులు.

ఈనగరమున కనతి దూరమున సూమాయను చిన్న యూరున్నది. ఇటకు నేనును గుప్తాగారును బోయితిమి. సముద్రములో నందరును స్నానముల నిమిత్తము ఇటకువత్తురు. మేమొక పళ్లషాపుకు బోతిమి. కొన్ని పండ్లనుకొంటిమి. ఆ పండ్లమ్మువాని భార్య చాకుతో సీమరేగుకాయలను మాకు కోసియిచ్చెను. సూమానుండి కోబెకు మరల ట్రాముమీద వచ్చివేసితిమి. ట్రాములో కొంతమంది కొరియావారు నెక్కిరి. ఇంగ్లీషు వారి దృష్టిలో మనమెంత తక్కువయో నంతకన్న జపానీయుల దృష్టిలో వీరు తక్కువయని గుప్తాగారనినారు.

కోబెకు నంటియున్న పర్వతములలో నొకటి 2300 అడుగుల ఎత్తు గలది. ఇందుపైన బుద్ధభగవానుని తల్లియగు మాయాదేవి గుడిగలదు. వేలాదివేల ప్రజలు యాత్ర సాగించుచుందురు. మజిలీలు ఏర్పాటు చేయబడినవి. మజిలీలలో తినుబండములను, పానీయములను, అమ్మెదరు. గుడి యున్న

ముజిలీ వరకు మాస్తరు గారు రెక్కలేక పోయినారు. ఒక మజిలీ లోని జపానీయుల పానీయముల షాపునకుఁబోయి సేదదీర్చుకొంటిమి.

ఈ మాయానస్ అను గుడియున్న పర్వతము అడుగు వరకును ట్రాముకారు నడుచును. అడుగునుండి పైకి గొనిపోవుటకు యెలక్ట్రిక్ రైలు గలదు. పైకెక్కుచున్న కొలదియు స్వారిలోనున్న కుఱ్ఱము మీదవలె నడుము వంచి కూరుచుండవలయును.

తాకరజూకాయను విచిత్రస్థలమును రాత్రివేళయె చూడవలయును. జపాన్ యువతులును యువకులును నేలయీనినట్లుండురచట. “తాకరజూకాను చూడక మీరు జపానును వదలరాదు.” అనిరి సహాయ్ గారు. ఒకరాత్రి ట్రెయినులో మక్కోనది ప్రక్కనున్న ఈస్థలమును చూపుటకు నత్తగారు నన్ను తీసుకొని వచ్చిరి. ఎన్నివేల ఎలక్ట్రిక్ దీపములైన గలవు. పట్టపగలు వలెనైనది. రోడ్లనిండ జనమే. రోడ్లప్రక్కన షాపులు అనేకానేకములవి.

తాకరజూకాలో స్నానములనిమిత్తము మూడు మినరల్ స్ప్రింగులు గలవు. మూడు నాటకశాలలు, బిలియర్డు గదులును గలవు,

తాకరజూకానుండి రైలుమీద మరల కోబేలోని సన్నోమియా స్టేషనుకు వచ్చుసరికి 12గంటలు దాటినవి.

కోబేలో గొప్పహోటేల్సు గలవు. తార్ హోటేలును గొప్పవే. కాని ఓరియంటల్ హూటేలుకు చాలవు. ఇంతకన్న గొప్ప హోటేలు జపాన్ లోనే లేదట. దీనిని టోయోకిసన్ కెయిషా కంపెనీవారు నడుపుచున్నారు.

కోబేలోని మంగలిషాపు లతిప్రశస్తమైనవి: మనదేశపు మంగలి దుకాణములకును వీనికిని సాపత్యములేదు. మంగలి క్షౌరములను చేయునప్పుడు తన నాసికారంధ్రములనుండి వెడలు శ్వాస క్షౌరములుచేయించుకొను వారిపై బడకుండునట్లు తననోటికడ్డముగ పైవైపుకు నేటవాలుగ దంతపు ముక్కనడ్డము కట్టుకొనును.

జపానువారిలో స్త్రీపురుషుల మధ్య సిగ్గనునది యున్నట్లుతోచదు. కోబేలో నున్న యొక గాజుఫ్యాక్టరీకి బోయియుంటిని. అందొక స్నానముల గదిగలదు. అందు కొందరు పురుషులు విగత వస్త్రులై స్నానములు చేయుచుండిరి. ఆస్నానపుగది తలుపులు తెరువబడియే యున్నవి. వారు స్నానముల జేయుచు మధ్యమధ్య కొలుములవద్ద గుమిగూడి పనిచేయుచున్న స్త్రీలతో మాట్లాడుచూనే యుండిరి. కాని వారి పరస్పర వీక్షణములందెట్టి వికృతభావము నాకుకనబడలేదు.

జపానులో ట్రాఫిక్ రూల్సు అమలునందు పెట్టరు కాబోలు గుర్రపుబళ్ళు, ఎద్దుబళ్ళు, రిక్షాలు, సైకిళ్ళు ఒకనియమములేక ఎడమకును కుడికిని పోవుచుండును. షిమనోసాకీలో నేమి, మోజీలో నేమి, కోబేలో నేమి. పద్ధతిలేని పచార్లు.

అయినను షిమనోసాకీ మోజీలకంటె కోబే త్వరితగతిని పాశ్చాత్య రూపమును దాల్చుచున్నది. పాత జపాన్ యొక్క చిహ్నములిచ్చట నానాటి కపురూపము లగుచున్నవి.

జపానీయులయొక్క కట్టుబాటు కొనియాడకతీరదు. ప్రతిబాలుడును, ప్రతిబాలికయు నిచట విధిగా స్కూలుకు వెళ్ళవలసిన కాలము ఆరు సంవత్సరములు. జపాన్ ప్రభుత్వము బాల బాలికల విద్యకొరకత్యంత శ్రద్ధచూపుచున్నది.

# ౨౧

## జపాన్ దేశము.

ఒసాకొనగరము, 26-5-1922:—

కోబేనుండి యొకగంట ప్రయాణమె యిచ్చటకు. మోటారుబస్‌లు ఎల్లప్పుడును పోవుచునేయుండును. ఈ బస్‌ల కండక్టరందరును ఆడుపిల్లలె. కాని వారు బాలుర దుస్తులనుతొడుగుకొని దూరమునకు మాత్రమె బాలురవలె కన్పింతురు. నల్లని టోపీ, నల్లనిచొక్కా, నల్లనిలాగు పిరిడ్రెస్. ఒక తోలుసంచి భుజమునుండి వ్రేలాడుచుండును. వీరికి ఇంగ్లీషు రాదో, వచ్చినను మాటాడరో. నాకు జపాన్ భాషలో కొన్నిమాటలె తెలియును. గుప్తాగారు నాతో కూడనుండి నాకు భాష రాని లోపమును కనుబడనియలేదు. వారేవో ఈ కండక్టరతో రెండుమాటలు మాట్లాడినారు. వారికి కావలసిన భోగట్టా దొరికినది. ఒక బస్‌లో నెక్కి కూర్చుంటిమి. ఈ బాలికలు బస్‌లను కండక్టు చేయుటలో నతి చురుకుగ నుండిరి.

ఒసాకొ నగరము చాల జన సమ్మర్దమైనచోటు. దీని జనాభా పదహారులక్షలన్నారు గుప్తాగారు. ఎప్పుడును నిసుక వేసిన రాలకుండ నుందురు జనులు వీధులలో.

ఒసాకొనగరము జపాన్ పరిశ్రమల కాకరము. ఈ పరిశ్రమాలయములలో తయారైన వస్తువులను దేశదేశములకు పంచునట్టి వర్తకశిఖామణుల్ల ఆఫీసు లిచ్చట నున్నవి. ఈనగరమున పెద్దపెద్ద బ్యాంకులును గలవు.

గుప్తాగారును నేనునుకలసి ఇండస్ట్రియల్ స్టోర్స్‌గల పెద్ద మేడలోనికి వెళ్ళినాము. ప్రతియంతస్తునందును రకరకముల జపాను సరుకుల నమ్ముచుందురు. ప్రతియంతస్తునందును జనులకు మితియుండదు. నేనును ఆల్బమ్‌లు, కాలరుపిన్‌లు, బొత్తాములు, బొమ్మలు మొదలగునవి కొంటిని. పయాల్లాగ్‌లో నేను కొనుక్కొని తెచ్చిన బంగారు ఫౌంటెన్ కలముపై A. N. Moorty అని అక్షరములను ఒకచిన్న మెషీనుచే చెక్కించి

నాము. తిరిగి తిరిగి ఒక యంతస్తులోనున్న తినుబండారముల దుకాణమునకు బోయి ఐయిస్క్రీమ్ భుజించి, కొంతసేపు సేదదీర్చుకొంటిమి!



## ౨౨

## జపాను దేశము.

నారాపట్టణము, 27-5-1929.

నారాకు కోబీనుండి పోవుటకు ఎలక్ట్రిక్ ట్రెయిన్ గలదు. నారా అనగా జపాన్ భాషలో లేడి యని యర్థము. నారాపట్టణములో నేవీధిని జూచినను, ఏయింటిముందు జూచినను, పార్కులలో జూచినను, బయళ్ళ యందు జూచినను, తటాకతీరముల జూచినను లేళ్లే. పట్టణమంతటను బిస్కట్ల దుకాణములున్నవి. ఇవి తవుడుతో చేసిన బిస్కట్లు. నారాకువచ్చు ప్రతి వారును ఈబిస్కట్లను నాలుగుమూడు సెన్లకు కొనియుంచుకొని, ఒక బిస్కట్ను మాత్రము చేతనుంచుకొని ఒక లేడికి చూపింతురు. అంతటనది వారిని వదలక వెనువెంటనే పోవుచుండును. ఆబిస్కటును అది తినుచుండగా జూచి గుంపులుగా నిలిచినయాచుట్టుపట్ల లేళ్లు బిస్కట్లుచూపించుచున్న ఆ యాత్రికునివెంట నడుచుచుండును. ఆ దృశ్యము చూడదగినదై యుండును. ఇచ్చట పెంచినన్ని లేళ్ల నొక్క మాదిరిగా మరెచ్చటను గాంచలేము. ఈలేళ్ల నెవరును హింసింపరు. అవి జనులలో కలిసి మెలసిపోయి తిరుగుచు నేయుండును.

ఈలోకమునగల యుత్కృష్టమతములలో నొకటియగు బౌద్ధమతము ఇండియాలో కంటె నితరచోటులందె వ్యాప్తి చెందియున్నది. బుద్ధుడు తన జన్మస్థానమున మరువబడి ఇతర ప్రదేశములందంతగా నారాధింప బడుచున్నాడు. జపానులో బౌద్ధాలయముల కేగువారి సంఖ్య లెక్కకు మీరి యుండును.

నారాలో నొక పెద్ద దేవాలయము గలదు. దాని పేరు తోడైజీగుడి. అదియొక చిత్రము. నేను గుప్తాగారును అందు జొచ్చితిమి! ఆశ్చర్యపడితిమి. ఇచ్చటగల బుద్ధవిగ్రహముకన్న పెద్దదగు బుద్ధవిగ్రహము ప్రపంచమున నింకెచ్చటను లేదనుచున్నారు. జపాను భాషలో బుద్ధుని దాయిబుత్సు అందురు. దాయిబుత్సుయొక్క చరిత్రను దెల్పు కాగితమునొకదానిని గుడిగుమ్మము వద్ద నాకిచ్చిరి. ఈవిగ్రహము 749 వ సంవత్సరమున తయారుచేయబడినదట. దీనినితయారుచేయుటకు 437 టన్నుల బ్రాంజు, 288 పౌనుల బంగారము, 7 టన్నుల మైనము, 165 పౌనుల పాదరసము, అనేకవేల టన్నుల రాక్షసిబొగ్గు పట్టెనని తెలియుచున్నది! విగ్రహముయొక్క ముఖము పొడవు 16 అడుగులు, వెడల్పు 9½ అడుగులు. ముక్కుపొడవు 1అడుగు 8 అంగుళములు, నోటి వెడల్పు 3 అడుగుల 9అంగుళములు, చెవులు 8½అడుగులు, బొటన వ్రేలి చుట్టుకొలత 4 అడుగుల 10 అంగుళములు. విగ్రహముయొక్క శరీరము యెత్తు 53 అడుగులు!

నారాలో నొక గొప్ప బ్రాంజిగంటను చూచినాము. దాని నిచ్చటకు వచ్చెడు ప్రతివిదేశస్థుడును చూచిపోవుచుండును. ఆ గంటయొక్క తూనిక 37 టన్నులు!

ఈపట్టణమున కసూగాయాలయమునకు జేరియొక్క పచ్చికబయలు లతివిశాలమైనదికలవు. అనతిదూరమున పచ్చని కొండలును గలవు. ఈ బయలు నందును కొండల దిగువను అంతర్వేదితీర్థములోవలె నెటగాంచినను యాత్రికులె! తమతమ మూటలనటువిప్పి వారువారు తెచ్చుకొన్న రొట్టెలను ఇతర భోజ్యములను భార్యాభర్తల సరససల్లాపములతో బిడ్డల వచ్చీరాని మాటలతో స్నేహితుల ఆటపాటలతో ఆనందించుచు తినివేయుచున్నారు. చుట్టును లేళ్లు యాత్రికులు తమకై మధ్యమధ్యను త్రోసెడు బిస్కట్లకై గంతులు వేయుచు పరుగిడుచున్నవి.

మాకును చీకటిపడుచున్నది! ఈయుత్తరమును పోస్టులోవేసి, రయిలు స్టేషన్‌కు మేమును పరుగిడవలసియున్నది !

# ౨౩

## జపాన్‌లోని నా ఇండియన్ మిత్రులు, విందులు, విహారములు.

కోబే, జపాన్, 31-5-29:—

కలకత్తాలో కె. వి. రాజా అండ్ వి. యస్. నారాయణ కంపెని వారిచ్చిన పరిచయపత్రికను ఖార్వారుగారి కుమారుని కిచ్చినాను. ఆయన బిలియర్డ్సు ఆడుటకు ఇండియన్ క్లబ్బుకు వచ్చియుండెను. చాలమంచివాని వలె కనిపించెను. మాకంపెనీకొకసారి దయచేయుడని నన్ను కోరెను. నడికయస్సు, ధృఢకాయుడు. జపానులోని ఇండియన్ కంపెనీలలో వీరిదియొక పెద్ద కంపెని. వీరికంపెనితాలూకు బ్రాంచీలు కలకత్తా, రంగూన్‌లలోనే గాక ప్రపంచములో నితరస్థలములందు గూడ యున్నవని తెలిసినది.

రంగూన్‌లో నామిత్రులు కొఠారీగారు ఇచ్చట ఇబ్రహీంకంపెని తాలూకు నూర్ మహమద్‌గారికి పరిచయపుటుత్తరమును వ్రాసియిచ్చియుండిరి. ఆయనను మొదట నేను ఇండియన్ క్లబ్బులోనే కలసికొంటిని. చాలమంచివాడు. మాకంపెనీకొకసారి తీరుబడిచేసుకొని వేంచేయుడనెను. ఒకనాడు వారి కంపెనీకి వెళ్ళితిని. అదియొక పెద్దకంపెని! గుమాస్తాలందరు జపానీయులు. ఒకజపాన్ స్త్రీ మాకు తేయాకురసమును అందిచ్చెను. నూర్ మహమ్మద్‌గారు నాకొక పరిచయపత్రికను తన చికాగో స్నేహితుని పేరయిచ్చి, "నావలన యింకను ఏదైన సహాయము కావలయునెడల చెప్పండి. సంతోషముగా చేసెదను" అనినారు.

బర్మాలోని హిర్జీకంపెనివారికి ఇచ్చటనొక బ్రాంచిగలదు. వారికిని నావద్దనొక యుత్తరమున్నది. హిర్జీగారికుమారుడు 20 ఏండ్లవాడు. అంత చిన్న వయసులోనుండియే యొక పెద్దకంపెనిని నడపుచున్నాడు. ఇచ్చట మామూలు ప్రకారము సరిగా 5 గంటలకు కంపెనిమూసివేసి. మమ్ములను తమ యింటికి తీసుకొని వెళ్ళినారు. మేడమీద అల్పాహార విందొసగెను.

రంగూన్‌లో ప్రేమ్జీ రామ్జీకంపెని తాలూకు హాసనాలీగారికిని నాకును స్నేహము. హాసనాలీగారి పినతండ్రి పి. యం. మాస్తరుగారు ఇ

ఇచ్చుట తానావాలా కంపెనీకి మానేజరు. హసనాలీగారి యుత్తరము మూలమున వీరికిని నాకును పరిచయము కుదిరెను. వీరదిచల్లని హృదయము. నీతిపరులు. మితభాషి. స్నేహపాత్రుడు. నిగర్వి. ఓడదిగిననాటినుండి నన్ను దినదినమును యేదోయొకస్థలమునకు గొంపోవును. మోటారులమీద గాని, రిక్షాలకుగాని, ట్రాములు రైళ్లు, దేనికిని నన్ను ఖర్చుపెట్టనీయరు. నన్నానందింప జేయుటయె ఆయన ప్రధానోద్దేశ్యము. ఒకనాడునాటకమునకని, ఒకనాడు పార్కుకని, ఒకనాడు కొండధారలకని ఈమిత్రుడునన్ను తీసుకొని వెళ్ళి చూపుచుండును. "మాస్తరుగారు—ఇదిధర్మమా ఎప్పుడునుమీరేఖర్చు చేయుట?" అనియడుగగా, "ఇంతకన్న మీకేమియుచేయలేకపోవుట నాకు చింతగానున్నది" అనును. ఒకనాడు సాయంసమయమున విహారానంతరము వీరింటికి వెళ్లినాము. వీరియింటపనికత్తె ఒకజపాన్‌స్త్రీ జపాన్ పద్ధతిని నడుమును తలయునువంచి మాకుగుమ్మమువద్ద సలాముచేసెను. పండ్లనొక ప్లేటునను, అదొకమాదిరిపకోడీల నింకొకప్లేటునను ఉంచిమమ్ములనుభుజింపుడనెను. టీకూడ అమర్పబడెను.

మద్రాసులోని కె. యస్. సెట్టిగారు ఇంటర్ నేషనల్ ట్రేడర్సు అనే కంపెనీకి ప్రొప్రయిటరు. ఆనందమోహన్ సహాయ్‌గారిపేర నొకయుత్తరమునిచ్చెను. ఈయననన్ను ఓడదిగునపుడు కలసికొనెను. స్ఫురద్రూపి. మంచిస్నేహితుడు. ఈయన సిల్కుబట్టల వ్యాపారమును చేయుచున్నారు. సిల్కులీదేశమున చాలచౌక. మంచినాణ్యముగల సిల్కులను అతిసరసమైన ధరలకు నానూట్లకును, షర్టులకును సప్లయిచేసెను. ఒకనాడువీరు మమ్ములను విందునకు పిలిచిరి. యూరపియన్ పద్ధతిని మేజాకుచుట్టును కుర్చీలపై కూర్చుంటిమి. సహాయ్‌గారి సతి నన్నాహ్వానించుచు నమస్కరించెను. వారియింటనొక జపాన్ వంటకత్తెయుండినను, బెంగాలుదేశాచార ప్రకారము ఆమెయు కొన్నిపిండివంటలను, కొన్నికూరలను స్వహస్తమున వండెనట. ఈమె అందకత్తెకాదు కాని ఆమెహృదయము మాత్రము చాలఅందమైనది. నాతో నామె నాంగ్లమున సంభాషించెను. రవీంద్రనాథటాగోరుగారి శిష్యురాలు. ఇంగ్లీషుకవులతో చాలపరిచయముగలదు! జపాన్ భాష తెస్సగా తెలియును. టాల్మాయోడలో నాతో ప్రయాణం చేసిన బెంగాలీ బ్యాంకరు సేన్‌గారు ఈమెకు బంధువు. సేన్‌గారికీమె

చాలచోట్లను చూపించెను. సేన్ గారు అమెరికాలో హార్వర్డు విశ్వవిద్యాలయమున బి. యస్. సి. పట్టమును బడసి యుండెను కాని ఆయన ఇంగ్లీషు పాండిత్యము జపాన్ దేశములాటి ఇంగ్లీషు రాని దేశములలో నదియేమి పనిచేయును? సహాయ్ గారు వ్యాపారపు వత్తిడిచే నెచటకు వెళ్ళుటకును సావకాశముచేదు. అందుచే, సేన్ గారికి పలుప్రదేశములు చూపుటకు ఆమెను పంపెను.

జె. టి. చేన్ రాయ్ కంపెని వ్యవహారమును నడుపుటకు ఈదేశమునకు క్రొత్తగా పంపబడిన తడానిగారొకరు నాకు పరిచయమైరి. వీరికి ప్రపంచములో ప్రతిదేశమునను సిల్కుదుకాణములు గలవు. ఈయన సింధుదేశము సింగపూరునుండి నాతో టాల్మ్యాయోడాలో ఒకటే కేబిన్ లో ప్రయాణముచేసెను. ఒక మధ్యాహ్నము వీరు నాకు విందొసంగిరి. ఆవిందు పూర్తిగా యూరపియన్ పద్ధతినిగాక, పూర్తిగా హిందూపద్ధతిని గాక మధ్యరకముగ నుండెను. ఏదియేటులున్నను నాకీయన పండ్లప్లేటులనమర్చెను.

జీ. ఆర్. కె చెట్టి కంపెని మేనేజరు గుప్తగారికి మద్రాసునుండి యుత్తరమును తెచ్చియుంటిని. వారు వైశ్యులు. మాయిద్దరిదినిసమవయస్సు. ఈ దేశమునకు వచ్చినదిలగాయతు వీరియింటనే నాబస. వీరియింట వంటకత్తె హిజాంకన్య. మాకు మూడువేళల అన్నము, కూరలు, పప్పుచారు వండి యిచ్చుచుండును. ఉప్పుగాని కారముగాని వేయుట ఈమెకు తెలియదుకావున నెనే కావలసిన కారమును ఉప్పును కూరలలో కలుపుకొని అన్నములో నుపయోగించుచుందును.

గతరాత్రి నన్ను కోటక్ గారు విందునకు పిలిచిరి. వారియిల్లు పర్వత సమీపముననున్నది. బయటనున్న బొత్తాము నొక్కగనే లోపల గంటచప్పుడు వినిపించి కోటక్ గారు బయటకువచ్చి తలుపు తీసినారు. కోటగారిభార్య నన్నాహ్వానించుచు చిరునవ్వుతో నమస్కరించెను. కోటక్ గారు గుజరాతీయులు. వారి భార్య మరాటాదేశమున పెరిగెను. ఆమెకూడా మనదేశపద్ధతిని దుసులను, తిలకమునుధరించియుండెను. ఇంగ్లీషు పరిచయములేదు కాని యీమెనాతో హిందీని ప్రసంగించుచుండెను. నిష్కల్మషముగను, దయార్ద్రమును అయిన నా మెహృదయము ప్రతివాక్యమునను స్పష్టముగ

చుండెను ఈ దంపతులు గీతాపారాయణమును నిత్యమును చేయుదురు. మహాత్మాగాంధీగారి ఆశ్రమములో పాడుపాటలను పాడుచుందురు. "వైష్ణవ జన్ తో కీజేరే" అను కీర్తనను నా కోరికమైన నామె ప్రత్యేకముగ నొక కాగితముపై వ్రాసియిచ్చెను. కొంత సేపు ప్రసంగించిన వెనుక "సహాయ్ గారి సతివలె నిమ్న సూక్ష్మలలో విద్య విస్తార లభ్యముగాకుండినను తరువాత భర్తసహాయమునను తన నిరంతరసాధన వలనను చక్కని సాహిత్యమును, ఉత్తమమయిన నడవడికను నేర్చుకొనియుండును" అని యనుకొంటిని. ఇంతలో సహాయ్ గారును, వారిధర్మపత్నియు, శ్రీయుత సేన్ గారునుకూడ వచ్చిరి. మేమందరమును ఒకరితో నొకరము సుల్లాసముగ మాట్లాడుకొనుచుంటిమి. ఇంతలో మమ్ములను కోటక్ గారి జపాను వంటకత్తె భోజనములకు రండని మేజావద్దకు తీసుకొని వెళ్లెను. చుట్టును కుర్చీలపై కూర్చుంటిమి ఒకప్రక్కన సహాయ్ గారును, మరియొకప్రక్కన నేనును సేనుగారును కూర్చుంటిమి. సేనుగారికిని కోటక్ గారికిని మధ్యనున్న కుర్చీపై కోటక్ సతియు, నాకును సహాయ్ గారికిని మధ్య సహాయ్ సతియు గూర్చుండిరి. ఎన్నిరకముల ప్లేట్లతోనో తినుబండారములు అమర్పబడెను. ఎన్నిరకముల తినుబండారములో యుండెను. అందు అన్నమును, అయిస్క్రీమును, బొబ్బట్లను మాత్రమే యిదివరలో రుచియెరింగినవి. తక్కినవన్నియు క్రొత్తవి. ఒకటికంటె నింకొకటి రుచి క ర ము గ నుం డె ను. అచ్చట నుంచిన ప్రతిరకమును నాకు సహాయ్ గారి సతీమణి కొంచెము కొంచెముగా అందిచ్చుచుండెను. ఆమె చక్కని మాటలలోబడి, మేమందరమును కడుపునిండువరకును తినివేయుచుంటిమి. ఇంతలో మరికొన్ని క్రొత్తరకములు తెచ్చినారు. అవి చాలరుచికరముగ నుండెను. తిరుగ మంచిమాటలను చెప్పి కోటక్ గారి భార్యయు, సహాయ్ గారి సతియు మాచేనన్నిటిని తినిపించినారు. ఈ సోదరీమణుల జీవితము నిర్మలమైనది హృదయములు పవిత్రములు. పతిభక్తి అతిథిపూజ, స్నేహపాత్రత, తెలివితేటలు నన్నాశ్చర్య నిమగ్నుని జేసినవి.



# జపాన్ దేశము.

కియాటోనగరము, జూన్ 4, 1929:—

కియాటో యను నగరము జపాన్ దేశమునకు సహస్ర సంవత్సరము లకు మించి రాజనగరముగ నుండెనట. ఇది ముఖ్యనగరముగ నుండినంత కాలమును జపాన్ చక్రవర్తులు గొప్పగొప్పవారిని రప్పించి, ఈదేశపు కళ లను పోషించుచుండెడివారట. ఈకళలకు సంబంధించిన పురాతన నిదర్శ నము లిచ్చట చాలగలవు. అందుచే జపానును చూడవచ్చు మాబోటి ప్రయాణీకులు ఈ పట్టణమును జూడక విడువరు. నన్నిచ్చటకు వెంటబెట్టు కొని వచ్చిన మంగయ్యగుప్తాగారికి కృతజ్ఞుడను.

గుప్తగారును నేనునుకలసి రాజాంతఃపురమును చూడబోతిమి. దీనిని మొదట 794వ సంవత్సరమున కట్టినారు. తరువాత నది పరశురామప్రీతి యైనదట. మరల 1856వ సంవత్సరములో నిర్మించినారు. దీనిచుట్టునుగల 220 ఎకరముల ఉద్యానము చూడదగినదై యున్నది. ఈసలమునకు ఇప్పటి కిని జపాన్‌చక్రవర్తులును, చక్రవర్తినులును చాలవిలువనుంచెదరు. వారప్పు డపుడు దీనినిచూచిపోవు చుందురట.

కియాటోయొక్క జనాభా 7 లక్షలు. ఏదిక్కునజూచినను, 5 పై శ్రపట్టణము.

ఈనగరమున 800 బౌద్ధాలయములు గలవు. జన్మస్థానమగు హిందూ దేశమున బుద్ధునిస్మరింపకున్నను, ఈపరాయిదేశమున ఈపట్టణమున ప్రతి వీధిని బుద్ధభగవానుడు జపికి వచ్చుచున్నాడు. బుద్ధుని యారాధన ఈ 800 ఆలయములందును నిత్యమును జరుగుచున్నది. ఈ దేవాలయము లన్నియును ఒకశతాబ్దమునందు కట్టినవికావు అందుచే నేయే శతాబ్దమున జపానీయుల శిల్పతన మెట్లుండినదియు ఈగుడులనుబట్టి కొంతగ్రహింప గలిగితిమి. ఈ 800 బౌద్ధాలయములలో చ్యోనిన్ అను బౌద్ధాలయము మిగుల పెద్దది. జపానులోని పెద్దబౌద్ధాలయములలో నదియొకటిగ జపానీయులు లెక్కింతురు. దీనినేగాక, ఇతర ఆలయములనుగూడ చూచుటకు ఒక్కొక్క

చోట 5 పెన్నులను, మరొకొక్కచోట నింతకన్న నెక్కువ పెన్నులను మాయొద్ద వసూలుచేయుచు వచ్చిరి.

కియాటోనగరమున గల "మారుయామా" అను ఉద్యానవనము కనులపండువొనర్చుచున్నది. ఈనగరమున నింతకన్న పెద్దపార్కు లేనేలేదు. ఈపార్కులోనికి వచ్చునంతమంది ఇచ్చటగల మరియొక పార్కును పోనూపోరు. ఇందు 400 సంవత్సరముల వయస్సుగల చెర్రీవృక్షమును చూచితీరవలయును. దీనిపైని రాత్రికాలమున వందలకొలది విద్యుద్దీపములు మహాకాంతు లీనుచుండ చూడ చోద్యముగా నున్నవి. ఈపార్కునందే "యసాకౌజినా" యను షింటోగుడి గలదు. వివిధాకృతులుగల బ్రాంజు లాంతరులు దీనినిండ వెలిగింపబడినవి. ఈగుడిలో జపానీయులు సంవత్సరాది దినమున నొకపెద్ద గడ్డిత్రాడును ఒకచివర యంటింతురట. త్రాడుపొడుగును తెగులబడియు తెగులబడకుండని గడ్డిని పీకుకొని వచ్చిన సమూహములు ఇండ్లకుగొంపోయి, ఆగడ్డి మంటపై వరిపిండిరొట్టెను తయారుచేసుకొని భుజింతురట. వారికి ఏడాదియంతయు నదృష్టమేనట వారినమ్మకము!

టీపాట్ సందులోనుండి యొకపర్వతము వారను ఎక్కగాఎక్కగా "కియోమిజు" కనిపించినది. "క్వానాన్" అను సివిగ్రహమునకు పదునొకండు ముఖములును, వెయ్యిచేతులును గలవు. "సాంజుసంగండు" అనుగుడి గూడ చూడదగినదే. ఇందు 33,333 విగ్రహములు కలవు!

మేము బసచేసిన "కియాటోహోటలు" తొమ్మిది అంతస్థులుగలది. ఇది 19[illegible]3 లో కట్టబడనది. ఈదేశమున భూకంపముల వలన నాశనము లెక్కువ యగుటచే, ఈబిల్డింగు భూకంపములు వచ్చినను నాశనముకాని పద్ధతిని నిర్మించినారు.



యొకోహామా 7-6-29:—

నిన్నను సుమారు కోబేయోడరేవుకు నేను చేరుసరికి 11 గంటలయినది. ఇదివరలో యొకోహామా యోడ రెండునంబరు పియర్ డి అనే హోటలు నుండి 6 న తేదీని 12 గంటలకు బయలుదేరునని ప్రచురణ చేసియుండిరి. ఆచోటికి నేను పెట్టెలను మోయించుకొని వెళ్లుసరికి ఆ పెద్దయోడ గట్టును చేరియుండెను. ప్రయాణీకులు తొందరగా తమ సూటుకేసులతో లోనికి బోవుచుండిరి. ఓడ యాఫీసరులు వారి స్నేహితులను భార్యలను అందరిని లోనికి రానిచ్చుచుండిరి. నాతో నిద్దరుస్నేహితులు కోబే వరకులు ఇండియనులు వచ్చినారు. వారిని వెంటబెట్టుకొని నేనును లోనికిబోతిని. నాగది 311 నంబరు దానిని వెదుకుకొనుచు వెళ్లి ట్రంకు, కేసు బాగ్, కేబిన్ లో నుంచి నామిత్రులతో కొంచెముసేపు తుదిసంభాషణ చేసేటప్పటికి 12 గంటల కొకసావు తక్కువగ నుండెను "మేము వార్ఫుమీద నిలబడెదము మీరుడెక్ మీద నిలబడెండి. ఈ కొంచెముసేపును ఈవిధముగ చూచుకొనుచు ఆనందింతము" అని వారు క్రిందకువెళ్లినారు. నేనుకొన్నియంతసులకు పైకి వెళ్లేసరికి క్రింద డెక్ కనబడినది. అప్పటికప్పుడే డెక్ వారనను జపానుబాలికలు వరుసను నిలబడియుండిరి. ఇంకను పై యంతసుకెక్కి పైడెక్కులమీద నిలబడవచ్చునుగదాయని పైకి చూచేసరికి ఏడెకుమీదకూడ చీమదూరుటకు సందులేకుండ బారులుతీర్చి జపానుబాలికలు నిలబడియుండిరి. నాకేమిచేయుటకును తోచుటలేదు. ఆ బాలికలమధ్య సందుచేసికొని నిలబడుదమాయని బుద్ధిపుట్టెను. క్రింద నాకొఱకు మిత్రులు తలలుపైకెత్తి వెదకుటకారంభించిరి. నాకు తావులేదు. ఆయువతులను తగులుటకు నాకిష్టములేదు. సిగ్గుచుండెను. కాని ముందుకుబోయి క్రిందనున్న నాస్నేహితులను చూడక తప్పదు. ఏమియు తోచక ఆ బాలికల వెనుక ఒకగజము దూరములో పచారులు చేయుచుంటిని. ఈసితిని యిద్దరుబాలికలు గ్రహించి వెంటనే చెరియొకదండపట్టుకొని నన్ను ముందుకు లాగుకొని డెకువారను వారిదరికిని మధ్య నిలబడుటకు స్థలముచేసినారు. నాకుకొన్ని జపానుమాటలను తెలియును. ఆ వచ్చీరాని మాటలతో వారికి నా వందనములను తెలి

పిచ్చాను. వారు చిరునవ్వుతో గ్రహించిరి. ఓడ కదలిపోవుసమయ మాసన్న మైనది, మీయాపులను చూచుచుండుడు, అని నాతో వారు తమభాషలో అనినారు. నా స్నేహితులు క్రిందనుండి జేబురుమాళ్ళను కదల్చుచు నావైపు దృష్టిని బరపిరి. నేనును నా రుమాలును కదల్చి వారికేసి చూచుచుంటిని. అప్పుడు పియరుమీద వేలకొలది జపాను యువకులు, యువతులు కంటికింపగు నగవులతో తమ స్నేహితులను, స్నేహితురాండ్రను వీడ్కొల్పుటకు వచ్చియుండిరి. పియరు కిక్కిరిసిపోయెను ఇసుకవేసిన నేల రాలకుండెను పైనుండి ఈబాలికలు కాగితపుచుట్టలను తమ యాపుల వైపుల విసరుచుండిరి. ఆ సన్నపాటి కాగితముల యొక్క ఒకకొన తమచేతులలో నుండెను. ఉండగం రెండవవైపు తమ మిత్రులచేతులలో నుండెను. ఎన్నియో రంగుల కాగితములు క్రిందనొకరును పైననొకరును పట్టికొనియుండిరి. కొంతసేపటికి క్రిందనున్న ప్రతియువకునియొక్కయు యువతియొక్కయు చేతిలో కాగితములయొక్క కొనలుండెను. రెండవకొనలు పైనుండిన ఈ యువతుల చేతులలోనుండెను. 12 గంటలయినది. అందరును భగవంతుని స్తోత్రమును ఎలుగెత్తిచేసినారు. ఇంతలో ఓడ పెద్దకూతవేసెను. డెక్ మీద బ్యాండువాద్యము ప్రారంభమయినది వారు ఒకరికొకరు "సయొనారా" అనగా సెలవుతీసికొనుచున్నాను అని చెప్పుచుండిరి. క్రిందనుండి యువకులందరును కలసి పైనున్న తమ స్నేహితురాండ్రకేసి జూచుచు నొక చక్కని వీడ్కోల్పు పాటను పాడుచుండిరి. ఓడ కదలెను. క్రమముగ నొకరికొకరు దూరమైనారు. కంటికి కనిపించినంతవరకు ఓడలోని బాలికలు హార్బరుమీదనున్న తమవారికి జేబురుమాళ్లు నాడించుచుండిరి.

ఈ జపాన్ బాలిక లందరును 14, 15, 16, సం॥ ల వయసువారు. అందరికి ఒకటేజుట్టు, ఒకటేజట్టు, జడలనుధరించి, తెల్లఫ్రాకులపై నల్లచొక్కాయును, నల్లపరికిణి, నల్లటిస్టాకింగులు, నల్లటిజోళ్ళు కోబేలోబయలు దేరి సర్దాకొరకు వీరందరును యోకహామా వెళ్ళుచున్నారు. అందరును హైస్కూలుబాలికలు. మొత్తము మూడువందలున్నారు అందొకయువతి నన్ను సమీపించి "మీ దేదేశము" అనియడిగెను. నేను ప్రత్యుత్తరమొసంగి మీరందరును అమెరికా వెళ్ళుచున్నారా? అని ప్రశ్నించితిని. లేదు. మాలో

నలుగురైదుగురము మాత్రమె యమెరికా వెళ్ళుచున్నాము. తక్కిన బాలిక లందరును ఈయోడమీద ప్రయాణము ఎల్లుండునో తెలిసికొనుటకు వచ్చినారు. వారు యోకహామాలో దిగుదురు. మా హైస్కూలు మాష్టర్లు కూడ మాకు తెలియని సంగతులను బోధించుటకు వచ్చినారు. అని చెప్పెను. వారందరును విద్యాసక్తులు, వారి భావములు ఔన్నత్యములును. వారిహృదయములు నిర్మలములును అయియున్నవి. వారితో సావకాశముగ మాటలాడిన కొలదియు మనహిందూదేశ బాలికల దుర్గతికి దుఃఖమువచ్చుచుండెను. మనదేశమునందజ్ఞానము రాజైయున్నది. ప్రతిపిల్లకును బొమ్మలాటల రోజులనుండియు "మగడు-పెండ్లాము-సిగ్గు" ఇదియే వారిమనో ప్రపంచము. తల్లులు మొద్దులు. వారైనను ఇదికూడదని బోధించి, ఆముద్దుబిడ్డల మనోబుద్ధులు మంచిరీతిని వికాసము నొందునట్లుచేయలేరు. తండ్రులు చాలవరకు చదువురానివారు. వచ్చినతండ్రులు అశ్రద్ధగనుందురు. మనదేశ మెప్పటికి మేల్కాంచునో, ప్రతి హిందువ బాలికయు చదువును నేర్చి తమ శక్తిని తమ బుద్ధిని ఎప్పుడు సన్మార్గమున కెక్కింతురో బాల్యమున మన బిడ్డలకు వివాహములుచేయు గొప్పదురాచారము మనదేశమున ప్రబలియున్నది. బాలికలు చక్కగా విద్యాభ్యాస మొనరించి తగియున్నపుడుతక్క చిన్నతనములో పరిణయములు ఎంతమాత్రమునుకూడవు. బాల్యవివాహము అన్నివిధముల యభివృద్ధికిని గొప్పయాటంకము. ఈదురాచారమును మనము మాన్పగలిగిననాడే తప్ప మనదేశమునకు స్థిరమైన ఏలాభమును కలుగదు. అజ్ఞానాంధకారమున మ్రగ్గుచున్న మన స్త్రీలు మనదేశమును స్వతంత్రదేశముగ మార్చివేయగల ధీరులను, ఉత్తమమైన భావి సంతతిని గనజాలరు. ఏజాతి యొక్క స్త్రీజనము మూఢులైయుందురో అజాతియొక్క మోక్షము బహుయోజనముల దూరమునకేగుట తథ్యము. ఈకఠినసమస్యను తేల్చకుండ, మన యువకులు, ఇతర విధముగ ఇండియాకు మేలొనర్ప చూచుచుందురు! శారదాగారి బిల్ ప్యాసగురోజు మనకొక గొప్పదినము.

ప్రసంగవశమున నిజపాన్ సోదరీమణులను మనసునందిడుకొని యింతగా వ్రాసినాను! ఇకనీయోడ విచిత్రములను గూర్చిచెప్పెదను. ఇది 15000 ల టన్నులయోడ. డెక్ చుట్టును 11 సార్లు షికారుచేసినచో నది యొక మైలగును. దీనికి రెండు మూడు డెక్కులుగలవు. డెక్కులులేకుండ

నింకను, అంతసులుగలవు. ఒకయంతసునుండి యింకొక యంతస్తునకు పోవుటకు మెట్లున్నవి ఇదిగాక ఎలక్ట్రిక్ లిఫ్టుగలదు!

లాండ్రి (అనగా చాకళ్లు యిస్త్రీచేయుచోటు) రెండవ అంతస్థు మీదనున్నది. కాని ఒక్కొక్క బట్టకు చాలచార్జీ యగును.

వైర్ లెస్ గలదు. ప్రపంచములోని ఏదేశమువారికైనను ఈయోడ మీదనుండియే సమాచారములను పంపవచ్చును.

స్త్రీలుగాని పురుషులుగాని కసరతు చేసికొనుటకు జిమ్నాజియమ్ ఉన్నది. అచ్చట గుఱ్ఱము ఏనుగు మొదలైన బొమ్మలమీద గూర్చుండి దగ్గరనే యమర్పబడిన ఎలక్ట్రికు స్విచ్ నొక్కినచో, నవి మనకు గుఱ్ఱపు కుదుపును ఏనుగు కుదుపును కలుగజేయును. ఈ జిమ్నాజియములో నింకను అనేకరకముల కసరతుపనిముట్లుగలవు. ప్రతివారును తమబరువును తూచు కొనుటకుగూడగలదు.

ఒకచోట నొక చెరువును ఏర్పాటుచేసినారు. అందులో ఈదుచుం దురు. ఏడెనిమిది యడుగుల నీరుకంటె ఎక్కువ యుంచరు. ఆచెరువులోనికి దిగుటకున్ను ఎక్కుటకున్ను మెట్లున్నవి. పురుషులు స్నానములుచేయు సమయములను స్త్రీలు ప్రత్యేకము స్నానములు చేయుసమయములను స్త్రీ పురుషులుకలసి ఈదుటకు వేళలును తెలుపబడి యొక నోటీసు దాని దగ్గర నొకచోట యంటింపబడియున్నది.

ఒక అంతసులో ఒక విశాలస్థలమున నొక యుద్యానవనమును నెలకొలిపినారు. అందనేక తరగతుల పూలమొక్కలు గలవు. స్త్రీ పురు షులు లతాగృహచ్ఛాయల విహారమొనర్చుచుందురు. అచ్చటచట మేజాబల్లలు కుర్చీలును అమర్చియుండిరి. అలసిపోయిన వారచట గూర్చుండి టీ మొద లయిన పానీయముల ద్రావుచు, వార్తాపత్రికల జదువుచుందురు. లేదా, పియానో వాయించుచుందురు. కొందరు గ్రామఫోనులను వినుచుందురు. మరికొందరు అప్పుడప్పుడు బ్యాండుస్వరమును ఆలకించుచుందురు.

ఈయోడలో ఆర్కెస్ట్రాయున్నది. ఇచ్చట దొరలును దొరసాను లును నాట్యము త్రొక్కుచుందురు. ఈప్రయాణికులలో కొందరు దొర సానులు ఫిలిప్పైన్ దీవులనుండి అమెరికాకు వెళ్లుచున్నారు. వారందరికిని

డ్యాన్సు చాల యిష్టమని తోచుచున్నది. ఎప్పుడు చూచినను డ్యాన్సు చేయుచుందురు.

ఇదేసలములో సినిమా జూపుచుందురు. గతరాత్రి 9½ గంటలవరకును సినిమాచూచి నిద్రపోయినాము.

---

## ౨౬

## జపాన్ దేశము.

యోకహామా, జూన్ 7, 1929:—

నిన్న సాయంకాలమునకు మాయోడ ఈరేవును జేరుకొనినది. "ఇదియా పరాయిసలము. సమయమా చీకటివేళ. ఇక నేనెట్లు బయటకుబోదును?" అనుకొనుచు "గంట నెప్పుడువాయింతురో. భోజనమునకుబోదము" ని సిద్ధముగనుంటిని. నేను సంత్ సద్గురువువారి బృందముతో కలసి ముజఫర్పూరు నుండి తిరిగి వచ్చుచుండగా నొక జంక్షన్‌లో కలసిన సింధుసత్సంగి సోదరుడు నాకొక పరిచయపులేఖ లొసంగి యోకహామాలోవారి బంధువునకొక లేఖను వ్రాసెను. నేనును వారి బంధువునకు కోబేనుండి ఫలాని యోడపై యోకహామా చేరుకొందునని వ్రాసియుంటిని. తత్కారణమున గాబోలు ఆసింధువర్తకుడు "మూర్తిగారెచ్చట?" నని యడుగుకొనుచువచ్చి నన్ను తెలిసికొనెను. ఆయనవెంట చీకటిలో మోటారుమీద నగరములోని కేగితిని. తిన్నగా సింధువర్తకసంఘమువారి భవనమును చేరితిమి. నన్ను మెంబర్లలో చాలమందికి పరిచయము చేసినారు. వారు చాలత్వరలో నొకపెదహాలులో జేరి, సభచేసిరి. తర్కవితర్కములు జరిగినవి. అంతయును సింధుభాషలోనే. నాకొకముక్కయైన తెలియలేదు. సభానంతరము నన్ను నాస్నేహితుడు తనయింటికి విందుకు గొంపోయెను. "ఈమె నాభార్య. ఈదేశమునకు మాసింధువారెవరును ఇంతదనుక కాపురము నిమి

త్రము భార్యలను తీసుకొనిరాక యీదేశమున నన్యథా కాలమును గడుపు కొనుచు, తమభార్యలను ఇండియాలో క్రుళ్ళబెట్టుచున్నారు. వీరికి సంస్కారణ మవసరమని సంఘముయొక్క ఆచరణకు వ్యతిరేకముగ నేను నా భార్యను ఈదేశమునకు తీసుకొనివచ్చితిని" అనుచు పరిచయముచేసెను! ఆమె మాకు అనేకరకముల హిందూపిండివంటలను పెట్టెను. మినపఅప్పడము నను వడ్డించినది. ఆమెకు రవీంద్రమహాకవి పుస్తకములనిన యిష్టమట. అందుచే రవీంద్రుని గొప్పనుగూర్చి చెప్పుచు, రవీంద్రనాథుడు టోకియోలో నిప్పుడున్నారనెను. వీరివద్ద శలవుగైకొని, రిక్షాలో బయలుదేరి ఓడ జేరుకొనినాను.

జూన్ 8-1929:—

ఈయుదయం మాయోడలో దుకాణములు వేసినారు జపాన్ సిల్కు వర్తకులు కొందరు. నాభార్య కొక మంచిసిల్కు ఓవరుకోటు ఇయ్యదలచినాను. రమ్యమగు నొక వస్తును నీకొరకు కొన్నాను.

రిక్షావానిని ఆసింధువర్తకునియింటికిమాట్లాడినాను. వాడట్లు నన్ను తిన్నగా నటకు గొంపోక ఒకవ్యభిచారియింటికి గొంపోయెను. ఆయింట నొకరు సారాబుడ్డిని విప్పి మేజావద్దగూర్చుండి గాజుగ్లాసును చాచుచున్న వాని గ్లాసులోనికి పోయుచుండెను. ఆదృశ్యమునుజూచి, నేననుమానపడి రిక్షావానిపై కోపముతో మాటలాడుచుండ ఆమెకనిపెట్టి ఇంగ్లీషున నీకేమి కావలయునని నన్నడిగెను. ఆవర్తకుని వీధిపేరు చెప్పితిని. రిక్షావానితో తానేమియో జపాన్ భాషలో ముచ్చటింపగనే వాడునాకు సౌజ్ఞచేసి, రిక్షాపై గూరుచుండబెట్టుకొని, యట కనతిదూరముననున్న నాసింధుమిత్రుని వీధికి తీసుకొనివచ్చి విడచెను.

విదేశీయులందరును యోకహామానగరమున నీభాగమందు మాత్రమే కాపురములున్నారు. ఈభాగమును బ్లఫ్ అందురు. ఈవిదేశీయులు ఎంతకాలము జపానులోనున్నను, వీరికి జపాన్ సభ్యత్వహక్కులు ఉండవట. జపాన్‌లో విదేశస్థులు ఎల్లకాలమును విదేశస్థులుగనే పరిగణింపబడుదురు.

ఈవిదేశసులు పూర్వమీనగరమున యామషటాన్ అనుభాగమున నుండెడివారు. పెద్దభూకంపము వచ్చినవెనుక వారందరు ఏభాగమున సౌధముల నిర్మించుకొనుచున్నారు.

సుమారు రర పుష్కరముక్రింద ఏపెద్ద భూకంపము వచ్చి యోకహామాను మంపదెంచి వదలిపెట్టెను. కాని ఈజపానీయులు భయమెరుగని జాతి. నాశనమయిన యోకహామాను పునర్నిర్మాణ మొనర్చుచున్నారు. ఈనగరముచాల విశాలముగను శోభాయమానముగను ఉన్నది.

మొదట నిదియొక చేపలుపట్టు కుగ్రామమట. అప్పుడుదానిజనాభా నూరు, ఇప్పుడు ఆరులక్షలు. జపానుకు ప్రధానీనగరమగు టోకియో కిది సింహద్వారమువంటిది. ఇటనుండి అచ్చటకెల్లపుడును విద్యుచ్ఛకటములు పోవుచుండును.

మాయోష జపాన్ లో నాగుట కిదితుదిస్థానమట.



# ౨౭

## హవయిదీవులు.

హోనలులూ, 17-6-1929:—

తెల్లవారిన కొంతసేపటికి హోనలులూ రేవు చేరినది టయోమారు ఓడ. ఓడ పియర్‌కు నిలకను అరఘంటాంగుమారమున నున్నదనగనే ఐదారుగురు ఈదుచు మమ్ముల నాహ్వానించుటకో యన వచ్చుచుండిరి. రేవు చేరగనే బ్యాండువాయించినారు. ప్రయాణీకులు గబగబదిగి పియర్ ప్రక్కలకు రాగానే పూలనమ్ము స్త్రీలు ప్రతి ప్రయాణికుని మెడను మాలలచే నలంకరించుచుండిరి. ఇష్టమున్నవారు దానిఖరీదును చెల్లించుచుండిరి. లేనివారు తమ మెడలనుండి దండలనుదీసి యా స్త్రీల హస్తములనే తిరిగి యలంకరించుచుండిరి. మోటారు టాక్సీలు రోడ్ పొడుగునను కుప్పతిప్పలుగ బడియున్నవి. మనిషికి ఒకడాలరు చొప్పున వసూలుచేసి హోనలులూలో చూడవలసిన ముఖ్యస్థలములను చూపుదు. పట్టణములో చాలరోడ్లమీద పోయిపోయి, మోటారుబండి ఒక పెద్దపర్వతము చుట్టును చక్కని బాటపై తిరిగితిరిగి, అగ్రమునకు గొంపోవును. దానిపేరు పంచ్‌బౌల్. ఆచోటునుండి హోనలులూయొక్క ప్రతిభాగమును విశదముగ కనుపించును. మోటారులే గాక ట్రామ్‌సర్వీసు కలదు. కాని మోటారులకును ట్రాములకునుమధ్య నొకతేడాయున్నది. మోటారులు తోలునది చాలవరకు ఆడవాళ్ళు. ట్రామ్ కారులమీద అందరును మగవాళ్లే. మన వావేలీకి పోయే ట్రామ్‌మీద నన్నుగ్గయమెరికను కండక్టరు నా ప్రక్కనుకూర్చుండి "మీ దే దేశము?" అని యడిగెను. హిందూదేశమని చెప్పినమీదట "హిందూదేశములో చాల మతముల వారుందురనియు, అందు హిందువులును మహమ్మదీయులును ఎక్కువమందియనియు వారెల్లపుడును ఒకరితో నొకరు కలహించుచుందురనియు వింటిమి, నిజమేనా?" యని యడిగెను. కొంత సంభాషణ జరిగినతరువాత రవీంద్రనాథ్ టాగోరుగారు అమెరికానుండి తిరిగి వచ్చుచు హోనలులూలో నుపన్యసించి రనియు, చాల గొప్పవారని వింటిననియు చెప్పెను. గాంధిగారిని గూర్చికూడ పేపర్లలో తాను చదివినట్లు చెప్పెను.

"బొంబేబజార్" అనే షాపు మీ హిందూదేశస్థునిది. ఆయనను కలిసికొన నిచ్ఛగింతురా?" యని యడిగెను. "ఇష్టమే" అంటిని. మమ్ములను సరిగ 'బొంబే బజారు' కు షామ్ రోడ్ మొగను దింపెను. ఆ షాపుకు మేము చేరుకొనునప్పటికి 5-30 నిమిషము లగుచుండెను. షాపులో సరుకులనమ్మ ఆడపిల్ల లందరు ప్రొప్రయిటరుగారికి గుడ్ నైట్ చెప్పి వెళ్ళిపోవుచుండిరి. ప్రొప్రయిటరుగారి సింధుదేశము. చాల మంచివారు మాతో టాగూరు గారినిగూర్చి ముచ్చటించి "హిందూదేశస్థులకు స్వాతంత్ర్యము లేదు. అందుచే మన మే దేశమున కెంత ధనికులమై యున్నను మనకు గౌరవము లేదు! అన్నిజాతులవారును మనలను చిన్నచూపు చూచుచుండుట నా అనుభవములోనిసంగతి" అనెను. హిందూదేశవర్తకులకును, హోనలూలూలోని వర్తకులకును చాల భేదము గలదు. ఉదయము ఒకరికంటె నొకరు ముందుగా షాపు తెరువవలెనని తెల్లవారకముందునుండియు బజారును సిద్ధముగచుందురు. రాత్రి ఒకరికంటె నొకరు ఆలస్యముగా మూయుచుందురు. అర్ధరాత్రము సమీపించువరకును అట్లనే కూర్చుండి యుందురు. అందుచే వారి యారోగ్యము ముసలితనము రాకముందే పూర్తిగా చెడిపోయి, అకాలమరణముల పాలగుచున్నారు. హోనలులూలో అన్ని షాపులను సరిగా 5-30 నిమిషములకు మూయబడును. అమ్మువారుగాని కొనువారుగాని ఆపైని షాపులవద్ద వచ్చినను కనబడరు. అందరును ఎవరికియిష్టము వచ్చినచోటికి వారు షికారు వెళ్లుదురు. ఇచ్చటగల వర్తకులు ఆఫీసర్లతో సమానముగ సుఖపడెదరు. వర్తకునిజీవితము చాల సంతోషకరముగ గడుపబడును. అందుచే నిచట ఆరోగ్యమునకు భంగములేదు" అనెను. తరువాత మేము సాయంకాల విహారమునకని ఆయనతో బయలుదేరినాము. అరఫర్లాంగుదూరము నడిచి యుందుమేమో ఇంతలో నిద్దరుపడుచులు మమ్ములను పిలుచుచుండిరి. ఆగి యెందుకు అనిఅడిగినాము. "మేము చేయి చూచి మీయదృష్టములను గూర్చి చెప్పగలము. ఇదేమా యిల్లు మీరు మీదకు దయచేయుడు" అనెను. ఇంతలో సేట్జీవచ్చి మేమందరమును ఇండియానివాసులము. మా యదృష్టములు మాకే తెలియును. మమ్ములను వదిలిపెట్టుడు" అనుచు మమ్ములను తనవెంటగొంపోయి "వీరు జ్యోతిషమును చెప్పుటయేగాక తక్కినపనిగూడ గావింతురు" అనెను. పదియము

సులు ముందుకు నడిచినాము. సేట్జీయొక్క కారు సిద్ధముగ నిలబడియుండెను. దానిపైమేము "కైకేకే" మొదలయిన భాగములకు పోతిమి. ప్రపంచములో నింతవరకు ఈపట్టణమును బోలిన పట్టణమును చూడలేదు. పట్టణమంతయు దరహాము మీదచూచినను విడివిడిగా ఏభాగమున కాభాగమును చూచినను, చివరకు ఏయింటికాయిల్లు గొప్పన ఆలోచించినను, చాల సుందరమైనది. ఎచ్చటజూచినను బహుశుభ్రముగ నుండును. ప్రతియింటిచుట్టును కన్నులకింపగు విధమున తోట్లు పెంచెదరు. ఒకకూలివాని యింటికి హీరాబాత్ అనే జపాన్ మిషనరీస్నేహితునితో గలసి భోజనమున కాహ్వానింపబడితిని. అతడొక దొరవలెనుండును. చాల మర్యాదగలవాడు, అతని భార్యకు నన్ను పరిచయము చేసెను. ఆమెనాకరస్పర్శనము చేసి కుర్చీవేసెను. కాళీఫోర్నియా బొత్తాయిపండు, న్యూజీలండు వెన్న, రకరకముల రొట్టెలు, హవాయ్ దీవుల యరటిపండ్లు, జామ్, కాఫీ — ఇవన్నియు భోజనమున కమర్చినారు. ఆమె మావద్దనే కూరుచుండి ఇండియానుగూర్చి మాతో నింగ్లీషున సంభాషించుచుండెను. భోజనానంతరము వారియింటిచుట్టునుగల వృక్షజాతుల జూపుటకు మమ్ము వెంటగొనిపోయెను. తరువాత వారి స్వంత కారులో నెక్కించుకొని మమ్ము పియరువద్దకు తీసికొనివచ్చిరి. తిరిగి మేము మా టయోమారు యోడకు వచ్చివేసితిమి.

తా.క. పంచ్‌చాల్‌నుండి ఒకజపాని క్రిష్టియను మతబోధకుని ప్రేరణవలన, హీరామత్ గారును, సింగ్ గారును, నిషిడాగారును, నేనును సానిబోరియమ్‌కు మోటారుమీద వెళ్ళినాము, అచ్చట నొకసభ యేర్పాటు చేయబడినది. చాలమంది జపానీయులు హాజరైనారు. నన్ను హిందూమతమునుగూర్చి మాట్లాడమనినారు. హిందూమతము యొక్క ప్రాముఖ్యమును గూర్చియు, మతోద్ధారకులను గూర్చియు ఋషులను గూర్చి యుపన్యసించినాను. హీరామత్‌గారు క్రిష్టియన్ మతప్రచారమున గూర్చి ప్రసంగించెను. ప్రార్థనానంతరము సభముగిసెను.

# ౨౮

## సాన్‌ఫ్రాన్ సిస్కో

అమెరికా, 25-6-29:—

మాయోడ నిన్న ఉదయము రేవు చేరినది. డాక్టరు పరీక్ష త్వరలోనే వదలిపోయినది. కాని పాస్‌పోర్టులు, వైజాలు చాల యనుమానముతోను, జాగ్రత్తగను, దీర్ఘముగ పరీక్షించిరి. ఇచ్చటి యెమిగ్రేషన్ ఆఫీసర్లు చాల స్ట్రిక్టుగా నున్నారు. సాయంకాలము 4 గంటలకు గాని చాలమంది ప్రయాణీకులకు మోక్షము లేకపోయెను.

నాలుగుగంటలకు ఓడను వీడి, పట్టణములోనికి వచ్చినాను. ఏవీధిని గాంచినను మోటారులు బారులు తీరి పొడుగునను నిలిచియుండును జనుల కంటె కారులసంఖ్యయె యెక్కువగా యనిపించును. రోడ్డుమధ్యనుండి ట్రామ్‌కారు పోవుచుండును. అది కుషన్లతో నమర్పఁబడి కూర్చుండుటకు అందముగ నుండును. పైనుండి జట్లు జట్లుగా ఎగిరిపోవుచుండెడు విమానములు కనిపించినవి. రాధారీ వలన చప్పుడు యెక్కువగుచుండును. రాత్రులు రాధారీ పగలుకంటె యెక్కువనుకొనెదను. గతరాత్రి మోటారుల ధ్వనులవలన నాకు చాల ప్రొద్దుపోవువరకు నిద్రపట్టలేను.

ఈ దినము 12 గంటలకు గోల్డెన్‌గేట్ పార్కు చూచుటకు తటసించినది. ఇది చాల పెద్ద పార్కు. పెయింటింగుపటములు చాల గొప్పవి గలవు. చలువరాతిబొమ్మలు (life like) జీవించియున్న మానవులా యనిపించెడివి చూచినాను. అక్వేరియంలో తాబేళ్లు కొన్ని యున్నవి. వానికాళ్లు పక్షిరెక్కలను బోలియున్నవి. (Lion seals) సింహము సీళ్లు తటాకములో పెట్టియింపబడినది. (Elephant seals) ఏనుగుసీళ్లు ఒకచోట జాగ్రత్తగ నుంచినారు. ఈపార్కులోని మ్యూజియములను చూచుటకెపుడును దొరలు దొరసానులు వచ్చుచుందురు.

# ౨౮

## సాన్‌ఫ్రాన్సిస్కోలోని లింకన్సుపార్కు.

ఈ పార్కును నాస్నేహితులు పాల్‌గారితో కలసి 26-6-1929 వ తేదీని పోయిచూచినాను. శాంతిమహాసముద్రపు టొడ్డున గోల్డెను గేట్‌చే సమీపమున నొక యున్నతస్థలమున నిది యేర్పాటు చేయబడినది. ఏ కాలమునను చల్లనిగాలి తీవ్రముగ వీచుచుండును. దీని కనతిదూరమున నుండగా వాయుప్రసారముచే నా హేట్ (Hat) ఎగిరి క్రిందకు దొర్లిపోయెను. అసలే చలిదేశము. గాలివలన మరింత చల్లగానుండును. పార్కులో బెంచీమీద కూర్చుండి యెండకాగినాను, ఆదగ్గరనే యొక వెడల్పు మూతిగల గొట్టముంచబడినది. దానిమీద సఫేద్‌తో పెయింటుచేసినారు, ఏమని? "మనపార్కుయొక్క అందమును చెడగొట్టుకొనకుడు. అందుచే కాగితపు ముక్కలను క్రింద పారవేయక దయచేసి దీనిలోవేయుడు. పార్కంతా పరిశుభ్రముగ నున్నది." ఏవిధమైన చెత్తయు క్రిందకనుపించదు. పచ్చిక మబ్బువలె పెరిగిపోకుండ కూలీలు చక్కని మెషీనులతో కత్తిరించి వేయుచున్నారు. పచ్చికబయలులో అచ్చటచట గుబురుగా రకరకముల అందమైన చెట్లు పెంపబడుచున్నవి. అందు కొన్నిటినిమాత్రము ఆగ్రాలోని తాజ్‌మహల్ వద్ద చూచియుంటిని.

ఈ పార్కు గడచిన మహాయుద్ధములో చనిపోయిన అమెరికన్ సిపాయిల జ్ఞాపకార్థము ఫ్రెంచిశైలిని నిర్మాణము చేయబడినది. దీనియావరణమున నొక మ్యూజియమ్ ఉన్నది. దానిలోనికిపోవు పెద్దగుమ్మమున కిరుప్రక్కలను వాషింగ్టను మహాశయుని యొక్కయు లింకన్ మహాశయుని యొక్కయు విగ్రహము లెత్తుగా నిలచియున్నవి వీరిద్దరును అమెరికను రాజ్యాంగ నిర్మాతలలో మొదటివారు. లోనికి పోతిమేని జీవకళలుట్టిపడునట్టి బ్రాంజు, ఇత్తడి మొదలగు లోహములలోను తెలుపేగాక, నస్నేకరంగుల శిలలలోను విగ్రహములు చెక్కబడియున్నవి. ఈ విగ్రహములు అనేక జాతుల మనుష్యులవి. ఇచ్చటను గ్రీక్ పుక్కిటిపురాణములలో మహాప్రపంచమున రచింపబడిన కొమ్ములుగల మానవులయొక్కయు సృష్టి

యందుగాక అగ్రీకు పురాణములందు మాత్రము వర్ణింపబడిన విపరీతప్రజంతువుల యొక్కయు బొమ్మలు కాన్పించెను. అన్నియు బాగుగనె యున్నవి. కాని మ్యూజియమ్‌లో చాలచోట్ల సగము బూతుబొమ్మలు కొన్నియు కేవలము పచ్చిబూతు బొమ్మలు కొన్నియు పెట్టబడినవి. సగముబూతుబొమ్మలనగా కొంతవరకు దాపరికమున్నవి. పచ్చిబూతు బొమ్మలనగా బట్టబయలుగా సర్వమర్మావయవములను కనపరచు నవియును స్త్రీపురుషుల కామక్రీడను నిరూపించు చున్నట్టివియును వీనిని చూచుటకు చాలసిగ్గయినది. నిత్యమును అమెరికను దొరలు దొరసానులు ఈమ్యూజియములోని బొమ్మలను చాలజాగ్రత్తగ చూచిపోవు చుందురు.

మ్యూజియముకు బయటనున్న విశాలప్రదేశమున గోల్ఫ్ఆట నాడుచుందురు. దానిప్రక్కనెయొక జిమ్నాజియం కూడగలదు. బాలురు బాలికలు బారుల మీద కసరతు చేయుచుందురు. అదిచూచుచు నాస్నేహితుడు (Paul) పాల్ గారును నేనును ఒక బెంచీ మీద యెండలో కూర్చుండి సంభాషించు కొనుచు కొన్ని నిముషములు గడపితిమి. ప్రసంగవశమున మిస్ మేయోయొక్క పుస్తకము మాటతలపెట్టి “మీ దేశములో చిన్నపిల్లలకు పెండిండ్లు చేసెదరట నిజమేనా? అంతకన్నను ఎచటనైనను ఎక్కువ హాస్యాస్పదమును సిగ్గునుగలదా?” యని పాల్ నవ్వినాడు. నేను “లేకేమి మీ బండ బూతు బొమ్మలున్నవి!” అని నేను నవ్వినాను.



# 30

## అ మె రి కా.

28—6—29:—

గఫ్‌రోడ్ నుండి ట్రాముకారు మీద చాలదూరము వెళ్లినాను. ఈ దేశములో ట్రాములను స్ట్రీటుకార్స్ లందురు. కుషనలతో చాల సౌఖ్యముగ నుండును. మనకు వీధులు సరిగా తెలియనపుడు కండక్టరుతో చెప్పినచో సరిగ ఆవీధివద్ద కారుఆపును. కండక్టరు సహాయమువలన నేను సరిగ వెబ్‌స్టరువీధికే వచ్చినాను. నేను దిగినచోటికిని 2963 నెంబరుగృహముకును చాల దూరమున్నది. అంతదూరమును నడచి సరిగా హిందూటెంపుల్ లేక హిందూఆలయము రీతిని కట్టబడిన వేదాంతా సొసైటీయున్న యింటికి వచ్చినాను. బయటనున్న బెల్ అనగా గంట త్రిప్పగనే లోపల స్వాములవారికి వినబడి మేడమీదనుండి దిగి క్రిందగదిలోనికి తలుపుతీసి "చాల సంతోషము-దయచేయుడు" అనుచు కరస్పర్శనము చేసి కుర్చీపై కూర్చుండ నియమించెను. వివేకానందా మిషనుకు చెందిన ఈస్వాములవారి పేరు దయానందస్వామి. నాఛాయనుండును. చక్కగా క్రాపింగు ఉంచుకొని అమెరికను శైలిని సూట్ వేసుకొనియుండెను. ఆభవనములో ఉపన్యాసముల నొసంగు హాలులో ఒకేపర్యాయము రెండువందలమంది కూర్చుండుటకు యేర్పాటు గలదు. ఒక నల్లనిబల్లమీద సంస్కృతలిపి కనుపించినది. "ఈ యమెరికనులకు వేదాంతముతోపాటు సంస్కృతమును కూడ నేర్పుచున్నాను" అనెను. ఆయన లయిబ్రరీ,పరుండేచోటు,వంటయిల్లు, స్నానముగది మొదలయిన అన్నిస్థలములను నాకుచూపెను. ఎంతశుభ్రము ఎంత సొంపు! మనదేశములో జమీందారులు మాత్రమే అంతశుభ్రముగా షోకుగా నుండుటకు వీలున్నది. అట్లుండకపోతే అమెరికను లసహ్యించుకొని ఈ యింటికి వేదాంతము కాదు బంగారముచేయుట నేర్పెదమనినను రారు. మనదేశములోవలె నేను జుట్టులేకయు బట్టలులేకయు నున్నచో వీధులలో నన్ను అమెరికను పిల్లలు వెంటాడి హేళన చేతురు. బహుశః ఆనేరము అభ్యతక్రిందరాబడి నన్ను జయిలులోకూడ పెట్టెదరేమో అనినారు. నన్ను

భోజనమునకు నిలిపెను, కోసుపువ్వు బంగాళాదుంపలు అన్నముకొంచెము కోడిగ్రుడ్డు కలిసిన బటాణీలు ప్లేటులలో బెట్టియిచ్చెను. బటాణీల ప్లేటు తిరిగి యిచ్చివేసి "స్వామీజీ నేను సత్సంగిని క్షమింపుడు. కోడిగ్రుడ్డుగాని ఏ మాంసాహారముగాని తినను" అన్నాను. "మా రామకృష్ణ మిషనులో ఎవరియిష్టము వారిది. కొందరు తినెదరు కొందరు తినరు. నేనుతినుచున్నాను. కాని మీరుఈదేశములో తినకుండ నుండజాలరు. చాల చలిదేశము" అనినారు. "సరే యింతవరకును దాటుకొని వచ్చినాను. ఎప్పుడు తినక తప్పని రోజులువచ్చునో అపుడు ఈదేశమునుండి వెళ్ళిపోయెదను" అని బదులు చెప్పితిని,

తరువాత నాస్నేహితునిరాక కెదురుచూచి యాతనితో కలసి ఫెర్రీ (అనగా బల్లకట్టు) అగునట్టి రేవువద్దకుపోతిని. కొంచెము ఆలస్యము ఉన్నపుడు పట్టపగలయినను సరే ఒక గోడపైనున్న సలమున సినిమాబొమ్మలను చూపుచుందురు. వానినిచూచుచు ప్రయాణికులు నిలబడెదరు. ఇంతలో బల్లకట్టువచ్చెను. దీనివెడల్పు 40 అడుగులుండును. పొడుగు 80 ఉండవచ్చును. రెండంతస్తులున్నవి. ప్రతియంతస్తునను ఇరుప్రక్కలను పెద్దపెద్ద బెంచీలపై దొరలును దొరసానులును కూర్చుండెదరు. ఈ బల్లకట్టుపై షాపులు, భోజనశాల, స్నానములగది, మొదలైన మానవసౌకర్యము లేర్పరుపబడియున్నవి. బల్లకట్టు అవతలయొడ్డును చేరగనే బెర్క్లీకిపోవు ఎలక్ట్రిక్ కారుమీద బెర్క్లీకి వెళ్ళినాను. కారువెళ్ళు త్రోవలో దూరమున పెద్దయక్షరములతో ఎడ్వర్టయిజ్మెంట్ బోర్డులు స్థాపింపబడినవి. కొలదినిమిషములలో బెర్క్లీ చేరినాను. హిందూస్థాని యొసోసియేషన్ యెక్కడనో విచారించి అచ్చోటికిపోతిని. సెలవుదినములివి. వేసవికాలము. ఆగృహమునందు ప్రస్తుతము ఒక అరడజన్ పంజాబు విద్యార్థులు కనుపించినారు. వారందరితోను చాలసేపు అమెరికన్ విశ్వవిద్యాలయములను గూర్చి మాటలాడి నేను తిరిగి కారుమీదను, ఫెర్రీమీదను సాన్‌ఫ్రాన్‌సిస్కో చేరుకొంటిని. హిందూస్థాని యొసోసియేషన్ యొక్క రీడింగురూములో తిలకు టాగూరు, వివేకానందుల పటములు గోడలకు తగిలింపబడియున్నవి. బెర్క్లీలో ఈమధ్యనే, సరోజినిదేవిగారు ఉపన్యసించి వెళ్ళిరని వారు నాతో చెప్పిరి.

---

## 30

# క్యాలిఫోర్నియా రాష్ట్రమున ప్రయాణము.

అమెరికా, జనవరి 1—7—1929.

నేను న్యూయార్క్కు పోవలసియున్నది. రైలుబండిలో ప్రయాణము చాల వేగముగ జరుగుమాట రూఢియే. ప్రయాణముకూడ ప్రమాద రహితముగను సౌఖ్యముగను జరుగును కాని, అమెరికాయొక్క ఈ దిశ నుండి యా దిశవరకు ప్రజాజీవిత మెట్లున్నదో తెలుసుకొనవలెనను నభిలాష మెండుగా నున్నది. త్రోవలో పట్టణములను పల్లెలను చూచుచు; హోటేళ్ళలో నిద్రకేగునపుడును రెస్టారెంటులలో భుజించునపుడును ఆ యా ప్రాంతీయుల యాలవాట్లను, భావములను కొంతయైన దెలిసికొనవలెనని మోటారు బస్లమీద గాని ప్లెజరుకారులమీదగాని ప్రయాణమును సాగించవలయునని నిశ్చయించుకొంటిని. ఈ నా యభిమతమును నా రష్యన్ మిత్రులైన పాల్ గారికి తెలుపగా "సరే, మీతోనున్న సూట్కేసులు మీరు న్యూయార్క్ చేరుసరికి సిద్ధముగా నటకు చేరునట్లు థామస్కుక్ కంపెనీవారిద్వారా ఏర్పాటుగావించుకొందమురండు" అని నన్ను గత నెల 29 వ తేదిని తీసుకొనిపోయెను. సూట్కేసులు న్యూయార్క్కు బుక్ చేసి శాన్ఫ్రాన్సిస్కో నగరమునగల యొక ట్రావెల్ సర్వీస్ కంపెనీకి వెళ్ళి, నలువది డాలర్లు చెల్లించి, ప్లెజర్ కారుమీద చికాగో నగరంవరకు టిక్కెట్టుపుచ్చుకొన్నాను. ప్లెజరుకారు 31 వ తేదీ 12 గంటలకిక్కడనుండి కదలును. సకాలమున కైను నిమిషములైనను ముందు మీరిచ్చట సిద్ధముగ నుండుడు అని ట్రావెల్ సర్వీస్ కంపెనీవా రనిరి. 31 వ తేదీలోన శాన్ఫ్రాన్సిస్కో నగరమున నేనెంత దనుక చూడగలనో చూచి యానందించి ఆ తేదీ 12 గంటలకు పాల్ గారితో కలసి ట్రావెల్ సర్వీస్ కంపెనీవద్దకు వచ్చుసరికి నా కారు కనిపెట్టుకొనియున్నది. అందు కార్ డ్రయివర్ కార్ ఓనరె. ఈతని ప్రక్కన కూర్చుండబెట్టినారు నన్ను. వెనుకసీటులో జాన్ ష్రెయివరుగారును, ఫింక్స్ గారును, సాల్ట్ లేక్ సిటీకి బోవు నొక యువకుడును ఉండిరి. వారితో పరిచయము జరిగిన వెనుక కరస్పర్శనమైనది.

ఇంతలో కంపెనీవారు బెల్ వాయించినారు. పాల్ గారు నాతో "మూర్తి, నీవు న్యూయార్కు కు పోగనె నాకుత్తరము వ్రాయుమీ, నీ కిది సంతోష జనకమగు ప్రయాణమగుగాక! బై బై" యనుచు చేయి నాడించుచుండెను. నేనును "బై బై" యనుచు చేయి నాడించుచుంటిని. కారు కదలెను. ఒక ఫర్లాంగు కాబోలు ఒకమాదిరిగ నడచినది. తరువాత స్పీడు యెక్కించినాడు డ్రయివరు. ఈతడు స్థూలకాయుడు. వెనుకసీటులోనున్న ఫెయివరు ఇండియాలో సైనికదళమునందు పనిచేసినట్లును తన సోదరియు తండ్రియు న్యూయార్కులో నున్నట్లును తా నచ్చటికే పోవుచున్నట్లును జర్మన్ యుద్ధానంతరమున ఇంగ్లాండులో వారికి పరిస్థితులు క్లిష్టమైనందున అమెరికాకు వలసవచ్చినట్లును చెప్పెను. ఈతనికి హిందీభాష తెలియును. ఎండ వేడిమికి మధ్య మధ్య "హవాగరమ్ హై" అని నన్నుచూచి యనుచుండెడు వాడు. ఫింక్స్ బక్కపలుచనివాడు. కాని, పొడగరి. చైనాలో నావికా దళమున పనిచేసెనట. వట్టి కొంటెవాడు. త్రోవలోని కొన్నిపల్లెలలో సయితము అమెరికన్ స్త్రీలు గౌనులను వదలి పురుషులవలె సూట్ ధరించుటను గాంచి, నవ్వి ఆక్షేపించువాడు. ఫెయివరుకు పడుచుపిల్లలు కనుబడుట తడవు వారిపైనుండి దృష్టి మరల్పకుంటకు. మా మోటారు పోవుచుండగా త్రోవలో నేదైన యింటి గుమ్మములో నేయువతియైన నిలబడినచో దూరమునుండియే "హ్యాపీ" యని కేకవేసి దగ్గరకు వచ్చిన వెనుక "హౌవ్యా సమ్ మిల్క్ ఫర్ మీ!" "నాకు కొంచెము పాలిస్తావా?" యని వేళాకోళము చేసేవాడు. అంతట ఫింక్స్‌గారును, డ్రయివరుగారును నవ్వ నారంభించెడివారు. నే నిలాంటి సందర్భములందు వారితో పాటు నవ్వకపోవుటను కనిపెట్టి "మిష్టరు మూర్తీ, మీకు నవ్వురాదా?" యనెను. ఫెయివరు. "బహుశః హిందూయువకులు మనవలె ఆడుపిల్లలు కనుబడినపుడు రెచ్చరు కాబోలు" నాన్నాడు ఫింక్సు హిందువులకుమాత్రము అందమైన ఆడుపిల్లలంటే యిష్టముండదా? యని ప్రశ్నించినాడు డ్రయివరు. "అమెరికన్ యువకుల నాగరికత యిట్టిదా?" అనుకొన్నాను నేను. "కాని, అందరును ఈ దుండగీడులవలె నుండకపోవచ్చు" ననుకొన్నాను మళ్లీ.

ఫింక్స్, ఫెయివరు ఎక్కసక్కెములాడుచునే కాలక్షేపము చేయు

చేసెండిరి. కారును మహావేగమున నడుపుచునే యున్నాడు డ్రయివరు. ఎన్ని వందల మైళ్లుపోయినను రోడ్ బహుదిట్టముగ నున్నది. కుదుపేలేదు. వంకర టింకరలుగ రోడ్డు పోయినప్పుడు ఆయా రకముల కర్వులను దెల్పుచు రోడ్డుప్రక్కన బోర్డులను కట్టినారు. ఏనిముషమున చూచినను, రోడ్డు నిండుగ కారులు నడచుచుండును. డ్రయివరులు బహునేర్పరులు. ఒకకో రింకొక కారును ఢీకొనకుండ వేలకొలది కారులను తప్పించుకొను పోవు చుండును. రోడ్డుప్రక్కన చర్చిగాని స్కూలుగాని యుండుచో ఇంకను ఒక ఫర్లాంగుకు ఆ చర్చిగాని స్కూలుగాని వచ్చుననగ, "చర్చి సమీపించు చున్నది. అనవసరముగ నిచ్చట హారన్ నొక్కకుము" అనియు, "స్కూలు సమీపించుచున్నది. అనవసరపు ధ్వనులను చేయకుము" నియు బోర్డులపై వ్రాసి యుంతురు. రోడ్డు కిరుప్రక్కలును హోటేళ్ళయొక్కయు షాపుల యొక్కయు ఎడ్వర్టయిజ్ మెంటులతో నిండియుండును. ఒక్కొక్క యెడ్వర్టయిజ్ మెంటుబోర్డుకు ఎంతో స్థలముపట్టును. ఆస్థలమును బట్టియె సాలుసరి అద్దెను మిక్కుటముగ చెల్లింతురు. ఎంత చిన్న గ్రామమయినను సరియే ఒక మునిసిపాలిటీగా నేర్పడి సర్వసౌఖ్యముల నమర్చుకొనును. మన దేశమందువలె పెద్దపట్టణములకును చిన్న పల్లెలకును ఇచ్చట తేడాకను బడదు. ఉన్న తేడా సైజులోనున్నది. అదిగాక పట్టణములో మేడలకు అంతస్థులెక్కువ. పల్లెలలోని మేడలకు అంతస్థులు తక్కువ. పట్టణములో వలెనే పల్లెలలోకూడ హోటేళ్లు, రెస్టారెంటులు, అతిశుభ్రమగు రోడ్లు, చర్చీలు, స్కూళ్ళు, పబ్లిక్ సంస్థలు హాలులు, విద్యుచ్ఛక్తి సౌకర్యము లన్ని రకములవి గలవు. పల్లెప్రారంభమగు స్థలమున యెత్తుగా తోరణము కట్ట బడును. ఆ తోరణముపై "ఈ మునిసిపాలిటీ మీకు హృదయపూర్వకముగ స్వాగతము నిచ్చుచున్నది." అని వ్రాయబడి యుండును.

పగలంతయు మాకారు ఆగినచోటులందెల్ల దిగి 'కోకోకోలా' యను చల్లని పానీయమును బుచ్చుకొనెడివాడను. దీని ఖరీదు బుడ్డి యొకటింటికి పావలా. మన దేశములో దీనికి సమానమగు లైమ్‌జ్యూస్ బుడ్డి యొక యణా మాత్రమే.

రోడ్ యెంతో శుభ్రముగ నున్నది. మార్గమందాగుచు న్యూస్ పేప

ర్లను చదివెడివాడను. చదివిన వెనుక కారుపోవుచుండగా రోడ్డుపై గిర వాటు వేయుచుంటిని. ఇదిగాంచి ఫెయివరు "మూర్తీ ఇది ఇండియను రోడ్డుకాదు. దయచేసి పేపర్లను రోడ్లపై పారవేయకుము" అనెను. నేను నాదురభ్యాసమునకును ఇండియనురోడ్ల దుస్థితికిని సిగ్గునొందితిని.

చిన్న చిన్న పల్లెలలో సయితము కేఫేలకు కొదువలేదు. కొన్ని కేఫేల గుమ్మముపై "ఈట్ హియర్" "ఇచ్చట తినుము" అని వ్రాసియుండును. ఫెయివరు, ఫింక్సు, ఎల్లపుడును "హాట్ డాగ్స్" అనబడు మాంసపు చీలికల దినెడివారు. నేను బంగాళాదుంప చీలికెల దినెడివాడను. నీవు నాకొసంగిన వట్టి కారమును కొంత పొట్లముగట్టుకొని జేబులో నుంచుకొనినాను. పైకితీసి ఆ చీలికెలపై జల్లుటజూచి ఫింక్సు "అయ్యెరటి స్టఫ్ ఏమిటి?" అని ప్రశ్నించెను. ఆ ప్రశ్న విని ఫెయివరు నా కారమును కనిపెట్టి యాశ్చర్యమును దెలుపుచు "ఈసరకు నోటిని మండించును ఇదే యిండియా!" అనెను.

ఇదెంత వేసవియైనను రాత్రులందు చలి యపరిమితముగ నున్నది. నా శరీరము గడ గడ వణకెను. అంతచలిలోగూడ వా రేమియు కప్పుకొనలేదు. కాని నేను తాళలేక, నావద్ద పోర్టుమ్యాంటోలోనున్న ఇటాలియన్ రగ్‌ను తీసి కప్పుకొన్నాను. దానిజూచి నన్ను "నైట్ టెంప్లాక్ ఆఫ్ ది ఈస్టు" అనుచు నవ్వినారు. కొంతసేపటికి వారును చలికి జడిసి, అమెరికన్ పద్ధతిని ఓవరుకోటును ధరించిరి.

ఈ కేలిఫోర్నియా రాష్ట్రమెంత ఫలవంతమైనదో చూడుము దా త్రోవ పొడుగునను ఫలవృక్షములతో గూడిన తోటలే. ఏతోటలలో మనదేశపు తోటలలోవలె కలుపుఉండదు. కలుపు పెరగగనె అమెరికన్ తోటమాలి అద్దానిని తనశత్రువుగ భావించి, వెంటనే యూడబెరుకును. ఇదిపెరుగకుండ జేయుటచే భూసారమునకు నష్టములేదు. అదిగాక భూమి కూడ స్వతస్సిద్ధముగ సారవంతముగ నున్నది. ఇందుచే ప్రతివృక్షమునకును ఆకుల సంఖ్యకంటె పండ్లసంఖ్యయె యెక్కువాయనిపించుచున్నది. ఇచ్చట పండెడు బత్తాయికాయ మన పాలకొల్లు బత్తాయివలె నుండదు. ఈకాయ కస్తూరి రంగుగలిగి, రసము విస్తారముగనుండి, బహురుచి నుండుటయెగాక

ఇట్టేను గింజ యెంతమాత్రమును కనుబడదు. ఎన్నికాయలు తెరచినను గింజ లేదు. ఈ కాయలను సన్ కిస్టు ఆరంజస్ అందురు. ఈకాయలు క్యాలి పోర్నియాలో సూర్యరస్మివలన పక్వమగుటవలన ఈపేరువచ్చినది. సన్ కిస్ట్ అనగా సూర్యుడు ముద్దాడినది!

ఈ కేలిపోర్నియా ప్రయాణము ప్రకృతి సౌందర్యముతో గూడియున్నది ఎటుచూచినను పచ్చని ఫలవృక్షములు. ప్రయాణ మెంతసాగినను పూలమొక్కలు దృక్పథమున బడుచునేయున్నవి ఆ పుష్పజాతులనుండి వచ్చు కమ్మని తావులు ఆ తరుపుల మరపించుచున్నవి. కొన్నికొన్నిచోట్ల బాటపై ఫర్లాంగులకొలది సున్నితమగు పూలసెజ్జను పరచినవో యనునట్లు ఆపొడుగునను ప్రక్కనున్న పూలతరువులు తమపుష్పచయములను పైనుండి జార్చెను. వాణిజ్య విద్యాభిలాషినై అధిక ప్రయాసలకోర్చి ప్రాచ్యదేశము నుండి మహాసముద్రములను ఖండములనుదాటి ఇటకు జయప్రదముగ వచ్చిన నాకీపాశ్చాత్యసీమ హృదయపూర్వక స్వాగత మిచ్చుచున్నదో యనునట్లు బహుదూరమువరకు నాపై పుష్పవర్షము పడుచుండెను.

---

# 39

## అమెరికాలో నెవాడా, యూటా రాష్ట్రమునందలి ప్రయాణము-సాల్ట్ లేక్-సాల్ట్ లేక్ సిటీ-మోర్మనుల పెండ్లిండ్లు.

2—7—1929:—

కాలిఫోర్నియా రాష్ట్రమందలి ప్రయాణము ప్రకృతిసౌందర్యముతో గూడినదై యున్నది. శాన్ ఫ్రాన్సిస్కోనుండి శాక్రమెంటోగుండా రనోవరకు కొండలమీద పయనముసాగెను. ఒక్కొక్కచోట అతిపల్లము. ఆపల్లము నుండి ఫర్లాంగుదూరము ఎక్కగానెక్కగా పర్వతాగ్రములు మరల ఫర్లాంగుదూరము దిగుచుండుట!

రీనోతో క్యాలిఫోర్నియా రాష్ట్రము సరి. తరువాత వచ్చినదంతయు నెవాడారాష్ట్రము. ఇందంతగా పర్వతములులేవు. నేల చదునుగా నున్నది, ఒకేగమనమున మా ఆటోమొబైల్ (అనగా మా మోటారు) నడచుచుండెను. త్రోవపొడుగునను రెండు గుఱ్ఱముల బగ్గీలు. ఈమోటారు యుగమునగూడ నీస్టేజికోచ్ లేమిటో యీరాష్ట్రమున!

నెవాడా దాటగనె యూటారాష్ట్రము ప్రారంభమైనది. మేము సాల్ట్ లేక్ సిటీకి పోవుమార్గమును బట్టించితిమి. సాల్ట్ లేక్ అనగా నుప్పు సరస్సు. మేమీసరస్సును సమీపించుసరికి సూర్యుడు తీవ్రముగ నుండెను. సరస్సునందు మాటవరసకైన నీరులేకుండ పీల్చినాడు సూర్యభగవానుడు. ఆ నీరములేని సరస్సునందు మాకారు మందగమన మొనర్చెను. ఉప్పులో జోరుగా నడపింపరాదన్నాడు డ్రయివరు. ఆయుప్పు బహుధవళముగను మెత్తగను ఉండెను. అప్పుడేయుతికిన తెల్లదుప్పటి పరచినదో యనినట్లుండె. యెటుచూచినను సాల్ట్ లేక్ నూరుమైళ్ళపొడవును అరువదిమైళ్ళ వెడల్పును కలిగి గంభీరమును గొల్పుచుండును. ఇందలినీరు సముద్రపునీటి కంటె ఆరురెట్లెక్కువ ఉప్పుకషాయమట!

సాల్ట్ లేక్ ను మేము విడచిన యిరువది నిముసములలో మాశకటము సాల్ట్ లేక్ సిటీని చేరినది, ఇది యూటారాష్ట్రమునకు ముఖ్యపట్టణమట.

జనాభా లక్ష యిరవై వేలట. ఇందు గవర్నమెంటువారి ఎసంబ్లీ హాలు చూడదగినది. ఇంతకన్నను చూడదగినది యాగొప్ప మోర్మన్ చర్చి.

యూటారాష్ట్రమందు మోర్మనుల జనసంఖ్య చాల హెచ్చు. వీరి నమ్మకములును అలవాటులును చిత్రములు. అందు ముఖ్యమగునది వీరి పెండిండ్లు. మనదేశమందలి దురదృష్టులగు కొందరిహిందువులవలెను, మహమ్మదీయ లోకమందలి మస్తుగా డబ్బుగలిగిన ముసల్మానుల వలెను ఈమోర్మనులలోని పురుషులు వారి వారి గుంజునుబట్టి ఒకభార్య బ్రతికి యుండగా మరియొక భార్యనుగాని లేక బహుభార్యలనుగాని పెండ్లిచేసుకొని గంపల కొలది సంసారములను పెంచుకొందురు!



## 33

సాల్ట్ లేక్ సిటీలో ముద్దులు-వయోమింగ్ రాష్ట్రమున హిందువులకు గౌరవము-నెబ్రాస్కా రాష్ట్రమందలి ఒమాహానగరము-.

ఒమాహా, అమెరికా, 5-7-1929:—

మాతో శాన్ ఫ్రాన్సిస్కో నగరమునుండియు మాఅటోమొబైల్ లో వెనుకటిసీటున కూరుచుండి ప్రయాణము సలిపిన యువకుడు సాల్టులేకు సిటీ నివాసి. ఈతడు చాల కుమరైన కుర్రవాడు. ప్రయాణ ప్రారంభమాదినుండియు గట్టిగా నూపిరియైన బిల్చెనోలేదో యనునంత నిర్మలుడు. నగరములోనికి కారు రాగనె, "మాయిల్లెంతో దూరములేదు" అనెను డ్రయివరుతో. అతనివీథిపేరును, యింటినంబరును డ్రయివరున కెరిగించెను?

అగృహముముందర పచ్చనినేల కొంతగలదు. ఆయావరణమున చిన్నకుక్క యొండాడుకొనుచుండెను. తనయజమానుని రాకను సంతసించి కాభోలు నాతని పేంటలూరు పైకెగురగా, దానితో నాతడుని మేషకాలము చెలగాటమాడెను. బయటనున్న బొత్తామును నొక్కగనే. లోపల, గంట వినబడి, తలుపుతీసినారు. తలుపుతీసిన అవృద్ధమాత తనకుమారుని కరస్పర్శనచేసి ముద్దుపెట్టుకొనెను. లోనసుండి యొకపడుచు చెంగుచెంగున వచ్చు

చుండెను. "అది యాతని భార్యయా?" యని యడిగెను ఫింక్స్ ఫేయి వరును.. "నాకేమి తెలియును? ఎటుముద్దిడునో చూచి నీవే తెలిసికొమ్ము" అని ఫెయివరు బదులుసెప్పెను. నవ్వుచు ఆపడుచు అతని కరస్పర్శనము చేసి, ఫాలమున ముద్దిడెను. అందువలన ఫింక్స్, ఫెయివరుగార్లకు ఆ సంబంధము తెలిసిపోయి యుండవచ్చును. వారూరకొనిరి. నాకుమట్టుకు అరము కాలేదు. "ఆమె యాతని కేమగున"ని నేను డ్రియివరు నడిగితిని." ఆమె యాతని యిల్లాలైతే, పెదవులమీద ముద్దిడియుండును!" అనినాడు.

మా కారు కదలెను. కదలిన కొంతసేపటికే, వయోమింగు రాష్ట్రమున నడుగిడితిమి.

సుమారు 12 గంటలయినది. మా కొకలీయైనది. అదియొక చిన్న యూరు. ఎంతచిన్నయూరు కానిమ్ము. రెస్టారెంటులకు కొదువలేదు. ఒక రెస్టారెంటులోనికి బోయి నాకు కావలసిన బంగాళాదుంప వేపుడుముక్కల ప్లేటును ఆర్డరుచేసినాను. చైనాదేశపు యువకుడొకడు దానిని నాకందించెను. ఈతడిచట చిప్పలను కడుగు వృత్తివలన జీవించుచున్నాడట. ఇట్లే చైనాదేశపుయువకులు వేసవి సెలవులలో నేదోయొక వృత్తిచేసుకొని, ఆ గడించిన సొమ్ముతో కాలేజీలలో విద్యాభ్యాసము సాగించుకొందురట. వృత్తినిబట్టి గౌరవము ఇచ్చుటకాదు స్వభావమునకు శక్తికి గౌరవమిచ్చుట, ఈవిషయమును ఇండియా నేర్చుకొనవలసి యున్నది

భోజనముచేసిబయటకువచ్చి కారుపైపాదమిడినానోలేదో నొకముసలివాడు అనతిదూరమునుండి నన్నుగాంచి సంతోషముతో హ్యాటునెత్తి పట్టుకొని "హెలో హిందూ!" యనుకొనుచునన్ను సమీపించి నాకరస్పర్శన మొనర్చెను. హిందూమతమునుగూర్చి యీదేశమున నొకప్పుడు ప్రచారమొనర్చి యుండిన రామతీర్థులవారును వివేకానందులవారును హిందువుల కఖండ మర్యాదను చేకూర్చిరి. హ్యాటుఎత్తుట గౌరవముకొరకు హిందువులనగా యోగాభ్యాసపరులనియు భక్తిపరసరులనియు సుస్వభావులనియు పుణ్యమూర్తులనియు లమెరికనుల యుద్దేశ్యము.

వయోమింగు రాష్ట్రమును దాటగనె నెబ్రాస్కా రాష్ట్రము వచ్చినది. ఈరాష్ట్రమునందు ప్రయాణము చేసి చేసి చివరకు వమాహానగరమును

పేరినాము. "ఈయొమాహానగర మెందులకు ప్రసిద్ధి?" యని డ్రైయివరు నడిగితిని. "ఇచ్చట పశువధశాలలు మెండు. గోమాంసపువను మాంసపు ప్యాకెట్లను సప్లయిచేయుటకును తోళ్ళను బాగుచేయుటకును ఈనగరము ప్రసిద్ధికెక్కినది" యనెను. పశువులనుచులకనగా నరుకుటకిచ్చట గొప్ప ఫ్యాక్టరీలు గలవు. ఈపాతకనగరము నెప్పుడు వీడుదునా యని యాతురపడుచు నీకీ నాలుగుముక్కలను వ్రాసి ఈపోస్టాఫీసులో కూర్చుండి కారుడ్రయివరు నన్ను బయలుదేరుమని యెప్పుడనునా యని నిరీక్షించుచున్నాను.



## ౩౮

అయొవా, ఇలినాయిస్ రాష్ట్రములందు ప్రయాణము—డాక్టరు సుధీంద్రబోస్ - అమెరికనుల సంబోధనలు - చికాగో నగరప్రవేశము.

చికాగో, 6—7—1929.

ఒమాహానగరముతో నెబ్రాస్కా రాష్ట్రము సరి. ఒమాహానుండి కౌన్సిల్ బ్లఫ్సుకు ఎంతోదూరమా? కౌన్సిల్ బ్లఫ్స్ అయొవా రాష్ట్రము లోనిది. అయొవా రాష్ట్రమున అయొవా విశ్వవిద్యాలయములో డాక్టరు సుధీంద్రబోస్ గారు గలరు. వీరు రాజకీయ శాస్త్రాధ్యాపకులు. ఈయన మనదేశమందలి ఇంగ్లీష్ పత్రికలకు వ్యాసములను బంపుచుండును. డాక్టరు సుధీంద్రబోసుగారిని మీలో నెవరైన నెరుగుదురా? యని కారులోనివారిని సగర్వముగ నడిగితిని. డాక్టరు సుధీంద్రబోసు మీ హిందూచాప్ కాదూ? నే నాతనినిగూర్చి విన్నాను. అమెరికన్ యువతిని బెండ్లాడి ఇటనె నివాసమేర్పడి పోయినాడు అని నాతో డ్రయివరు అనెను.

"చాప్" అను శబ్దమునకు మన మాశ్చర్యపడనవసరముండదు. ఒకరినిగూర్చి మాటాడునప్పుడు వారు దట్ ఫెలో యందురు. యువకులను జెంటిల్మెన్ అని గాని యంగ్ మెన్ అని గాని యనరు. బోయ్ లేక బోయిజ్ అని పిలుతురు. ఉపన్యాస ప్రారంభమున చైర్మెన్, లేడీజ్

ఆండ్ జెంటిల్మెన్ అని మన దేశములో వలెగాక హాలో ఎవెరిబాడీ అని సంబోధింతురు. ఒకరినొకరు హాయ్ గయ్! అనుకొనుచుందురు. త్యాంక్యు బడీ అందురు!

అయొవా రాష్ట్రమును పూర్తిచేసికొని మా ఆటోమొబైల్ ఇలినాయిస్ రాష్ట్ర సరిహద్దును, జేరు సరికి అపరాహ్నమయినది. అదేమి దురదృష్టమో గాని ఇన్నిదినములనుండియు సరిగనేయున్న టయిర్లు పదే పదే జెజములు పడనారంభించెను. కాని డ్రయివరు చాల నోపిక గలవాడు. విసుగుకొనకుండ, కారును రోడ్డు ప్రక్కను ఆపుకొనుచు, జాకీవలన చక్రము నెత్తి, టయిరుతీసి, సునాయాసముగ రంధ్రమును గుర్తించి, బాగుచేయుచు ఎట్లెట్లో సూర్యాస్తమయ సమయమునకు చికాగో నందలి ఈ వై. యం. సి. యె. భవనమునకు ఘటములను, జేరవేసెను! ఇన్నిరోజులనుండియు ఆటోమొబైల్ లో నంటిపెట్టికొని యుండిన కారణమున నా వెన్నెముక నొప్పి పెట్టుచున్నది. ఇంతటినుండి నా పయన మిక రైలులో సాగించెదను. ఇప్పటికి ఆటోమొబైల్ లో ప్రయాణమనిన ప్రాణము విసిగినది. శరీరము కడు బడలినది. ఇప్పుడే వేడినీళ్ళ స్నానముచేసివచ్చి, నీకీ యుత్తరమును వ్రాయుచున్నాను.

—oo—

# అమెరికాలోని షికాగో నగరము

7—7—1929.

షికాగో నగరముయొక్క యీ వై. యం. సి. యె. భవనమున కెన్నియో యంతస్తులు గలవు. చూచుటకీ బిల్డింగ్ బహు గంభీరముగ నున్నది. మొదటి ఫ్లోరులో గోడకు తగిలించి బిల్డింగ్ యొక్క జనరల్ డైరక్టరీ గలదు. దానినిబట్టి య్యే యంతస్తునకేమిగలదో జనరల్ గ బోధపడును. ఏయంతస్తున కాయంతస్తునకె డైరక్టరీలు గోడకు గట్టబడియున్నవి. దానిని బట్టి యేయంతస్తులోని యేహాలులో నే గదిలో నేమియున్నదియు వివరములతో గ్రహింతుము. ఇంకను వివరములు కావలయునెడల, గదిముందర గోడకుగాని గది తలుపునకుగాని చేయబడిన యేర్పాటు మూలమున ఆగది లోనివారి పేర్లు తెలియును. ఈ వై. యం. సి. యె. లో నొక్క చిన్న వార్తా పత్రమును లోనికి వచ్చు ప్రతి క్రొత్తవానికి అందించబడుచున్నది. దీనికి వై. యం. సి. యె: హోటేల్ న్యూస్ అని పేరు. దీనినిబట్టి చూడగా ఈ బిల్డింగ్ యొక్క యావరణలోనికి వచ్చిన ప్రతి స్త్రీకిని పురుషునికిని క్రైస్తుమతవాసన తగులవలెనని ఈ బిల్డింగ్ ను కట్టించిన వారి యాశయమని స్ఫురింపక మానదు. ఈ సంసద్వారా జరుగుచున్న సేవ మిగుల ప్రశంసనీయము. ఈ సంస్థ యనేకవిధముల నుపయోగకారియై యున్నందుననె ప్రపంచములోని యన్ని దేశములవారును అన్ని మతములవారును షికాగో నగరమును చూడవచ్చినపుడు వై. యం. సి. యె. ను తమ యిల్లుగా జేసికొందురు. ఈ వై. యం. సి. యె. వారియొక్క ఒక యాక్టివిటీని యుదాహరణముగ జూచుకొనుము. ఇక్కడకు వచ్చిన ప్రయాణీకుల మేలుకొరకు ప్రోగ్రామ్ డైరక్టరుగారి డెస్కు స్థాపింపబడినది. ఈ గొప్పనగరమును తెలివితేటలతో తక్కువకాలములో చూచి వేయుటకు వీరు సులభోపాయములను దెలుపుటయు, డైరక్టరుగారి సలహాతోడను, సహాయముతోడను మనకుగల కాలమునుబట్టి నగరమును తొందర తొందరగగాని, నిదానముగగాని చూచుటకేర్పాట్లు పూర్తిచేయుటయు మెచ్చుకొనదగినవికావా?

నేను ఈ నగరమున ఖర్చుపెట్టగల కాలము తక్కువ. కాని నగర మంతటిని చూచివేయవలెనను నాశ యెక్కువ. అయినను, ఈ నగరమంతటిని నే నెట్లు ఇంత స్వల్పకాలములో చూడగలను? ఈ నగరముయొక్క పొడవు 24 మైళ్ళు అందుచే ముఖ్యమగునవియును, సాధ్యమగునవియును చూచుటకు బయల్వెడలితిని.

అమెరికాలోని సంయుక్త రాష్ట్రములలో నిది న్యూయార్కు మహానగరము తరువాతిది ప్రపంచమంతటిలో నిది నాల్గవది. దీనిజనాభా 25 లక్షలట, ఇక్కడ స్కాయిస్క్రేపర్లు మెండు, ఈదేశమున్న నాకసమున అంటబోవుచున్నవో యనునట్లున్న యనేక యంతస్తులుగలిగి, గొప్పయెత్తుగనున్న సౌధరాజములను స్కాయిస్క్రేపర్లు అందురు. ఈ స్కాయిస్క్రేపర్లకు ఈదేశమున మొదలుపెట్టిన దీనగరవాసులె యనుచున్నారు. షికాగో నగరములో స్కాయిస్క్రేపర్లకు పునాది భూమిలో నూరడుగులుండును. ఏలనన, భూమిని అంతలోతుగ త్రవ్వవరకు రేగడిమట్టియు, నిసుకయు నుండును. 100 అడుగులక్రింద రాయి ప్రారంభమగును. రాయి తగులు వరకు వారు పునాదిని త్రవ్వుచునే యుందురట! ఈగొప్ప స్కాయిస్క్రేపర్లు కొన్ని ప్రత్యేకముగ మహాధనికుల వర్తకాగారములై యున్నవి.

ఈ నగరమున లింకన్‌పార్కు మొదలగు విశాలమగు నుద్యానవనములును బాల బాలికలకొరకు విశాలమగు నాటస్థలములును చాలగలవు. ఏవిచూచినను సమూహములతోనిండి కలకలలాడుచుండు ”

షికాగో నగరవాసుల స్పిరిట్‌కు ఆనందించవలసియున్నది. వారి నిర్మాణములు వారి సంస్థలు వారి స్పిరిట్‌యొక్క స్వభావమును తెలుపుచుండును. ఎల్లవిధముల వారు మానవాభ్యున్నతికి ప్రయత్నించుచుందురు. వారి ప్రయత్నములు సఫలీకృతము లగుచునెయున్నవి. సఫలీకృతమైన కొలదియు వారి శక్తియందు వారికి నమ్మిక మెక్కువగుచున్నది. ఇంకను పెరుగవలెనను నాశ యెల్లరిమనంబుల నాక్రమించుకొనినట్లు తోచుచున్నది.

ఈ షికాగో అమెరికాలోని యనేక రైలుమార్గములకు పెద్దకూడలి (జంక్షన్) యైయున్నది. ఇంత పెద్దకూడలిని చూచుటకు నేను చాల సంతోషపడితిని. షికాగో గొప్ప వర్తకస్థానము. మిషిగన్‌సరస్సు పొడుగు

నను మైళ్లకొలది వ్యాపించుకొనిన దీ నగరము. ఈ నగరముయొక్క లిమిట్స్‌లో చాల సరస్సులుగలవు. కొన్నియోజనలు ఈ సరస్సులనుండి పయనమగుచుండును. షికాగోలో షికాగోనదికలదు. దీనిలో పెద్ద పెద్ద పడవలు సరకుల నెక్కించుకొని పోవుచుండును. నదిమీద బ్రిడ్జీలు కట్టబడియున్నవి. బ్రిడ్జీ రెండుసగములుగ నుండును. మెషీన్ సహాయమున ఈ పెడనుండియు ఆ పెడనుండియు బ్రిడ్జీయొక్క సగములను ఎత్తెదరు. అప్పుడు నదిలోనుండి యెత్తుపడవలు పోగలవు.

షికాగో కాయదినుసుల వర్తకము, కలపవర్తకము, మాంసపువర్తకములకు ప్రసిద్ధి. కొన్నికోట్లటన్నుల కాయదినుసులు వీరి గోదాములలో నిలవచేయబడి ధర పెరుగగనె అమ్మివేయబడుచుండును. కొన్నివందల సంవత్సరముల వయసుకలిగి వందలయడుగుల పొడుగునను, వంద దరిదాపుఅడుగుల చుట్టుకొలత ప్రమానుకలిగిన వృక్షరాజములను వీరడవులలో సాయింగ్ మెషీనులవలన కొన్నినిముషములలో పడగొట్టి కలపవర్తకమును సాగించుచున్నారు. ఇక్కడనుండి మాంసపు ప్యాకట్లు 40 దేశములకు అనుదినమును మంచుమధ్య ప్రిజర్వుచేయబడి పంపబడుచున్నవి. ఈవర్తకము కొరకు వారి స్టాక్ యార్డులలో లక్షలజంతువులు ఎప్పటికప్పుడు వధింపబడుచున్నవి.

ఈమాంసపు ప్యాకట్లవ్యాపారమున సుప్రసిద్ధుడు ఆర్మరుగారు. ఈయన నవకోటినారాయణుడు. వీరి ఫ్యాక్టరీలో 40,000 మంది పనివారు గలరు. ఈకోటీశ్వరుడు ప్రపంచమందలి వివిధదేశములలో మొత్తము 500 బ్రాంచీలను స్థాపించినాడు. తనదేశమందలి తనవ్యాపారముకాక ప్రత్యేకము విదేశవ్యాపారము సాలుసరికి ఈయనది 10 కోట్ల డాలర్లు. జంతువుల నిమిత్తము సాలుసరికి ఈయన వెచ్చించునది (తనదేశముయొక్కయు, విదేశములయొక్కయు, మాంసపువ్యాపారము నిమిత్తము) 30 కోట్ల డాలరులు. ఎవరికిష్టమున్న వారే ఈయన ఫ్యాక్టరీకిబోయి చూడవచ్చును. నెలకు 14000 మంది ప్రేక్షకులు ఫ్యాక్టరీని చూడబోవుచుందురని లెక్కవేసినారట.

ఈనగరమందలి షికాగో ఫస్టు నేషనల్ బ్యాంక్ యొక్క బిల్డింగ్ చూచితీరవలసిన బిల్డింగ్. లోకమునందే యితర బ్యాంకింగ్ బిల్డింగైనను దీనికి లాగ్జే యనుచున్నారు.

ఇక్కడ చాల బిజీగానుండు వీధులు కొన్నిగలవు. అందు డియర్ బారన్ వీధి యొకటి. ఈ వీధియందలి పోస్టాఫీస్ బిల్డింగ్ ఎన్నియో యంతస్తులను గలిగి చాల గట్టిగా కట్టబడినది. దీనికి కుడివైపుననున్న లాసాలీ వీధిలో జరుగు బేరములు కోట్లమీదనె.

షికాగోలోని విశ్వవిద్యాలయము చాల గొప్పది. ఈదేశమందలి విశ్వవిద్యాలయములలో పేరెన్నికగన్న వానిలో నిదియొకటి. ఎన్నియో బిల్డింగులుగలవు. దీని పుస్తకాలయములో 500 వేల గ్రంథములున్నవట. ఈ విద్యాపీఠము సంవత్సరము పొడుగునను పనిచేయును. సాలుకు 4 టెరమ్స్. ఇందే మూడు టెరమ్స్‌లో హాజరయినను ఒకసంవత్సరముగ పరిగణింపబడునట. ఈ నగరములో యోగీ రామచరకాగారు యోగపబ్లికేషన్ సొసయిటీని స్థాపించినారు. ఈసొసైటీవారు ప్రచురించు పుస్తకములు వేడివేడి పెసరట్లవలె నమ్ముడయి పోవుచుండును. నాకు టయిమ్ లేక ఈ సొసయిటీగల చోటుకు పోలేకపోయినాను. అహా! వివేకానందుడు మన వారికిని మన యోగగ్రంథములకును ఎంతటి మర్యాదను గడించి పెట్టెను! చికాగోలో పార్లమెంటు ఆఫ్ రిలిజియన్స్ జరిగిన దినము నిక్కువముగ శుభదినము. నాడుగదా వేదమహిమనుగూర్చి ఈ యమెరికనులు మొదటిసారి వినినది. నాడుగదా వీరు వివేకానందుని పుష్పపూజ చేసినది!

రాత్రిభోజనమునకు వేళయైనది. కావున ఈయుత్తరమును త్వరలో ముగించుచున్నాను. ఇంకను నీకు ఎన్నియోసంగతులు వ్రాయవలెననుకొనినాను. కాని, ఆకలి! అందుచే, మరికొంచెము మాత్రమే వ్రాసిముగింతును.

ఇంతటి యఖండనగరముగదా యిది! 100 సంవత్సరముల క్రిందట నిది యొక యడవియట! నరసంచారమున్నదని తెలుపుటకు గాబోలు నొకటి రెండు గుడిసె లుండెడివట. కొన్నాళ్ళకీస్థలమున 12 ఇండ్లు లేచినవి. మరి కొన్ని యేండ్లుగడుచుసరికి యిచ్చట 4000 జనాభా యేర్పడెను. కాని1871 నాటికి పెద్దపట్టణమయ్యెను. దురదృష్టవశాత్తూ ఆసంవత్సరమున పట్టణము పరశురామప్రీతియాయెను. అన్ని బిల్డింగులు నాశనమాయెను తమపరిపట్టణవాసులు మరల తమపట్టణమును కట్టుకొనునప్పుడు ఎన్నిటికిని చెక్కుచెదర

కుండదని నిశ్చయించుకొనిరి. 10 సంవత్సరములలో ఈనూతన పట్టణమును నిర్మించుట కారంభించిరి.ఇప్పుడిచ్చటిభవనములు శాశ్వతముకొరకేర్పడినవి.

ఏది తలంచుకొనినను సాధింపగలమను నమ్మకము ఈనగరవాసుల నాక్రమించుకొనినది. మానవుడు చేయలేనిది లేదని వీరి విశ్వాసము. ఆ దృఢ విశ్వాసముతో వీరు తమ భావిజనులకొరకు తమ నగరరాజము కొరకును ఘనకార్యములను తలపెట్టి, కృషిచేసి, సఫలులగుచున్నారు!

---

## ౩౬

అమెరికాలోని బఫాలో పట్టణము, 8—7—1929.

తానొకటి తలచిన దైవమింకొకటి తలచును. షికాగోనుండి నీకుత్తరమును వ్రాసి పంపెదమనుకొంటిని. అట్లే నిన్నను షికాగోలో నుత్తరమును వ్రాసి పోస్టులో వేయుటకు సిద్ధముగ నుంచితిని. కాని యవకాశము లేకపోయెను. పోస్టులో వేయనేలేను. ఈ యుత్తరముతో పాటె దానినికూడ వేయవలసి వచ్చినది.

ఇప్పుడింకను తెల్లవారలేదు. మూడు గంటలయినది. ఇంకొక గంటన్నర కాలములో నయాగరాఫాల్స్కు పోయె ట్రెయినులో బయలుదేరుదును. ప్రపంచములోని ఏడు అద్భుతములలో నయాగరానదీ జలములు అఖండమైన యెత్తునుండి పడుచోటు ఒకటి. ఇది నాకు అయాచితముగ లభించుచున్నది. ఇచ్చటనుండి యది యనతిదూరము.

షికాగోనుండి నిన్నను బయలుదేరినాను. ఫిలడల్ఫియాకు నిన్నను టిక్కెట్టు తీసుకొనినాను. మధ్యను ఈ బఫెలో స్టేషనుగలదు. ఇచ్చట ట్రెయిన్ మార్చవలసియున్నది. ఇటనుండి నయాగరాఫాల్స్కు పోయి చూచిన తరువాత తిరిగి ఫిలడల్ఫియాకు ప్రయాణమును సాగింతును.

మన రాఘువదగ్గర అట్లాస్గలదు. దానిలో చూచుచుండు నెడల, నేను చూచు ప్రతిదేశము, ప్రతి పట్టణము ఎటనున్నదియు తెలియుచుండును.

నా ప్రయాణములను గూర్చి ఎప్పుడైన నాలో నేను ఆలోచించుకొనిన నప్పుడు నాకు ఆశ్చర్యముగనుండును. ఇప్పటికనేక దేశములు తిరిగినాను. అనేక పట్టణములను చూచినాను. కాని యమెరికావంటి దేశముకాని, ఈ దేశములోని పట్టణములవంటి పట్టణములుగాని ఎచ్చటను గాంచలేము. అమెరికా మొదట చూడగనె భయంకరముగ నుండును. ఇది యొక విచిత్ర ప్రపంచకము. ఈలోకమే వేరు. అందుచేతనే కొలంబోలు దీనిని పాతాళ లోకమని వాడిరి.

చాల దేశముల సినిమాబొమ్మలు పూర్వగాథలనో, కల్పితకథలనో చూపుచుండును. అమెరికాను గురించిన బొమ్మలుకూడ అట్టివే యని తలంచెడివాడను. సినిమాలోచూచి "కొంతవరకును కల్పనయుండును. లేకున్న, ఈ మానవులు ఈ నడతలు, ఈ వీధులు, మేడలు, ఈ చిత్రభావాలు నిజమగుట సాధ్యమా" యనుకొనెడివాడను. నిజము నిలకడమీద తెలిసినది ఈ దేశమున నడుగుపెట్టిన తరువాత పూర్వపు అభిప్రాయమును మార్చుకొనినాను. ఈ యమెరికానుగూర్చి సినిమాలు చూపునవి సత్యము. కేవలము సత్యము. ఎన్నడైన నమెరికన్ ఫిల్ములు వేసినపుడు సినిమాకువెళ్లి చూచుచుండుము. ఏ జాతిమధ్య నిప్పటి నానిత్యజీవనము గడచుచున్నదో తెలియగలదు.

ఇట్టి పరిస్థితులు గల, మన యిండియాకు అనేకవేల మైళ్ళ దూరమున నున్న ఈ యమెరికాలో నొంటరిగ నేను చేరుట, దేశముయొక్క పడమటిదిశనుండి తూర్పుకు అనగా ఈ చివరనుండి యాచివరకు ప్రయాణములు సాగించుచుండుట, చిత్రమైన సంగతిగ నాకే తట్టుచుండును.

పిల్లలు మనకెంతముద్దైనను వాండ్లభావ్యభివృద్ధిని తల్లిదండ్రులు ముఖ్యముగ నభిలషించి, విద్యాబుద్ధులు గరపింపవలసిన పూచీయున్నది. ఇది యాలోచించియే మన కృష్ణను ఒకనాడు ఆగ్రాలోని దయాల్‌బాగ్‌కు ప్రయాణము చేసినాము. వాడు కాకినాడ పెద్దభోట్ల సీతారామయ్యగారితో వెళ్ళిన తమపరి నీవెంత హృదయవేదన నొందితివో కడుపున కార్చిచ్చు పెట్టినట్లెంత బాధనొందితివో అంతయు నెరుగుదును. వానికత్యంత బాల్యావస్థ యగుటచే నేనును చాలకష్టపడితిని. కాని నాకష్టమును ఎంతమాత్రమును

కనబడనిక, పైబడి నీకు ధైర్యమును చెప్పుచుంటిని. ఆనాటి దృశ్యము నేటి సభయందున జ్ఞాపకమువచ్చి నాకండ్లను నీటిలో క్రమ్ముచున్నది. కృష్ణ నీ కట్టివాడో నేను మాయమ్మకట్టివాడను. దేశములను సముద్రములను దాటి, ఖండాంతరములందున్న నాకొరకామె ఏమి కటకటలాడునోయని యొకప్పుడు మనసు వ్యధచెందుచుండును. ఆమె నాకొరకు వ్యధచెందుటవలన నాకు కష్టము కలుగును. ఆమెకును మనోవ్యాధి చెరుపె కాబట్టి యామెకు నావిషయమై ఏవిధమైన దిగులును లేకుండజేయుటకు ప్రయత్నింపుము. ఆమె సంతోషముగనున్నచో నాకు కార్యసిద్ధియగుననియు, భూప్రదక్షిణము చేసివచ్చిన పుణ్యము తనప్రభావముచేతనే నాకు దక్కగలదనియు, అదియుగాక, సద్గురు పాదములు నమ్మి ధ్యానించుచుండు వాకేచిక్కును రాజాలదనియు, హుజూరు వారు "నీకు శుభమగుగాక!" యని నన్ను దీవించియుండగా, జయప్రదముగ తిరిగి తనదర్శనమును చేయుటకేసందియము ఉండగూడదనియు చెప్పుచు ఆమెకు ధైర్యమును గొల్పుము.

"ఎంత ధనవంతుడైనను ఎంత బలవంతుడైనను, ఎంత మేధావియైనను, సాధారణముగ చేరలేని యీప్రదేశమును చూచుటకు, నేను విశేషధనవంతుడను కాకున్నను, బలవంతుడను మేధావిని కాకున్నను, గత జన్మములలో చేసుకొనిన పుణ్యముచేతనె, ఈజన్మమున సద్గురు ఆశీర్వచనములభించి, ఈస్థలమునకు వచ్చుట తటస్థించినది" యని యేలనో అప్పుడప్పు డనుకొనుచుందును. అంతట కొంతసేపు సద్గురుధ్యానమున నిమగ్నుడనై యుందును. ఎన్నియో చోట్ల సద్గురుమహిమ నాకు గోచరమగుచున్నది. తప్పక మోసమురాగల సందర్భములలో, మబ్బువిడినట్లు, వాతావరణముమారి, నాకే యపాయమును రాక, సంతోషముగ బయటకు వచ్చుచున్నాను. సద్గురుకృపయొక్క సూచనలు అన్నియెడలను కనిపించుచున్నవి. సద్గురుమహిమయు, సద్గురుదయయు గాకున్న నొక్క నిమిషమిట్లు ఈచోట గడపవలెనని నిశ్చయముగ నమ్ముచున్నాను.

# 32

## నయాగరా జలపాతములు

కెనడా, 8—7—1929:

బుఫెలో స్టేషనునందు తెల్లవారుజామున నిలబడిన ట్రెయిన్ ఒక ఫర్లాంగు పొడవుండు నగుపించినది. తెల్లవారుచున్నదిగాని యిందు జనులు తక్కువ; బోగస్ (రైలుపెట్టెలు) యెక్కువ. నేను కూరుచుండిన బోగలో నేనొక్కడనే ప్రయాణికుడను. కొంతతడవుకు ట్రెయిన్ కండక్టరు నాబోగికి వచ్చి "పిల్లవాడా, ఎచ్చటకుం బోయెదవు?" అని ప్రశ్నించెను. నయాగరాకు టికట్టిమ్మంటిని. యునైటెడ్ స్టేట్సులో టిక్కట్లు రైళ్లలోనూ అమ్మెదరు.

సుమారు 8 గంటలకు మా రైలుబండి మమ్ము నయాగరాఫాల్స్ అను నగరమునకు తీసుకొని వచ్చినది. స్టేషనులో మమ్మాహ్వానించినది టాక్సీలవారు. ఒక టాక్సీవాడు నా హ్యాండ్ బ్యాగ్‌ను తీసుకొని ముందు నడచెను. అతని కారులో కూర్చుంటిని. పట్టణ మధ్యమునుండి యది పోయి పోయి భూలోకమందలి ఏడు చిత్రములలో నొకటియగు నీ మహావిచిత్ర దృశ్యముకడ నన్విడిచెను. ఈదృశ్య మెంత యద్భుతమో యంత భయంకరము. ప్రకృతి రామణీయకములలో నింతకన్న రామణీయకమైనది గాని, భయావహమగునది గాని నే నింతదనుక గాంచలేను. నాశరీరము గగుర్పొడిచెను. ఆసలము దాపింపలేక పోవుచుంటిని. టాక్సీవానిని నా వెంట రమ్మంటిని. "నీహ్యాండ్ బ్యాగ్‌ను టాక్సీలోనుంచి పొమ్ము. నేను రాను. నీ వెంత చూడనెంచితివో చూచి తిరిగి రమ్ము. నే నిటనె తిరుగాడుచుందు న"నెను. నే నొంటరిగ బోవుట ప్రాణసంకటముగ నుండెను. కాని దీనిని చూడకయె పోవుట కిసుమంతయైన నిష్టములేదు. ఇంతటి గంభీరలావణ్యమున కింత భయానకరసమా? అత్యంత సౌందర్యమును గాంచినపుడు మానవుని సహజయల్పతకు చలనము కలిగి మనసు చకితమగును. సృష్టికారకుడగు దైవమేడ, అల్పుడగు నరుడేడ? భగవంతుని దివ్యసృష్టి గాంభీర్యతకు ఏ పురుషుడు కంపితుడు గాకుండును? ఏ పురుషుడు ఆశ్చర్యమున నిశ్చేష్టి

తుడై గాకుండునా? ఇట్టితటి ఎవ్వ డిట్టిదృశ్యమును వర్ణింపగలడు? కొన్ని చూచి యానందింపదగినవే కాని వర్ణింప నలవికావు; సరికదా, కలమెంత వ్రాయ బ్రయత్నించిన నంత దృశ్యమందలి సారస్యము తగ్గించుననియు దోచెడిని. అయినను, నేనిట్టి ఘనవైభవమును గాంచుటయు నా సత్య కొంత వరకైన దీనిని గూర్చి గ్రహింపకుంటయు ధర్మముకాదని యీలేఖను వ్రాయుచున్నాను.

ఈరీ సరస్సనియు అంటారియో సరస్సనియు అమెరికాలో రెండు ముఖ్య సరస్సులు. ఈరీసరస్సు అంటారియో సరస్సు మట్టముకంటె సుమారు 170 అడుగులయెత్తు. ఈరీలోనుండి ప్రవహించు నయాగరానది అంటారియోలో పడుచున్నది. ఈజలపాతము భూమిపైగల నే యితర జల పాతముకన్న పెద్దది. జలసమూహము అన్నియడుగుల యెత్తునుండి పడి పోవునపుడు తుంపరలు పరిమితి లేకుండ దట్టముగలేచి మేఘములవలె గనుపించును! ఆ బిందువులగుండ సూర్యకిరణములు పోగనే హృదయా కరకమగు నింద్రధనస్సులు ప్రతినిముషమును బయలుదేరుచుండును. ఈ జలంబులు చాలలోతున పడునపుడు అవి చేయుధ్వనులు రకరకములుగ నుండును. మనుష్యకంఠమున వానికి సాటియగు ధ్వనులులేవు. ఈ పాతము యొక్క గొప్పచప్పుడు చుట్టుపట్ల మైళ్ళకొలది వినిపించును. నయాగరా జలపాతములనుండి విశేషముగపుట్టు విద్యుచ్ఛక్తిని అమెరికనులును, కెనేడి యనులును ఈనగరమున కట్టబడిన పవరుహౌసునుంచి యనేకమైళ్ళు తీగె లగుండ గొంపోయి నగరములలో ట్రాములకొరకును, దీపములు, యంత్ర శాలల కొరకును వినియోగింతురు. మనదేశమునగూడ నిట్టి జలపాతములను చూచియానందించి యూరకొనక విద్యుచ్ఛక్తిని లాగినచో చాల లాభకర ముగ నుండును.

నయాగరా జలపాతములను ఉదయమున జూచుటకు యునైటెడ్ స్టేట్సు వైపే మంచిది. ఆవైపునుండి చూచినంతసేపు చూచి, కెనడా వైపునుండి చూడవలెనని, బ్రిడ్జిదాటి కెనడాకు వచ్చితిని. ప్యాస్‌పోర్టు పరీక్షయైనగాని యీబ్రిడ్జివద్ద కాపలాయున్న ఇమిగ్రేషన్ డిపార్టుమెంటువారు నన్ను కెనడాలో నడుగుపెట్టనీయలేదు. యునైటెడ్ స్టేట్సు వైపుననున్న నయా

గరా ఫాల్స్ను యునైటెడ్ స్టేట్సువారే పరిపాలన. కెనడాకు చెందిన నయాగరాఫాల్స్ నగరమునకు పరిపాలన కెనడాదేశీయులే. కెనడాలోని నయాగరాఫాల్స్ నగరమునుగూడ కొన్నివీధులను జూచివచ్చితిని. ఈ క్రియు తరమును కెనేడియన్ పోస్టాఫీస్లో వేయుచున్నాను. కెనడాకూడ యునైటెడ్ స్టేట్సువలె గొప్పదేశము.

---

# 3౮

ఫిలడల్ఫియానగరము 9—7—1929

నయాగరా జలపాతముల మహాచిత్రమును తనివితీర చూచివచ్చి, నయాగరాఫాల్స్ అను రైల్వేస్టేషనునందు ట్రెయినులో నెక్కితిని. ప్రయాణము సాగుచుండెను. ఇంతలో నా భుజముపై వెనుకనుండి చేయి వైచి నన్ను పిలుచుచున్నట్లయ్యెను. కాని యంత స్నేహముగ నన్ను బలుకరించువారీ పరాయి దేశమున నెవరుందురా యని సందేహించుకొనుచు వెనుకకు తిరుగగనె, "ప్యాస్పోర్టు ప్లీజ్" అను శబ్దము వినవచ్చెను. "అయుధము నా జేబులోనె యున్నది" అనుచు ప్యాస్పోర్టు నాతని కిచ్చితిని. కావలసిన దాని నాతడు త్రిప్పి చూచుకొని నాకు మరల నొసంగుచు, "మీ రిండియా నుండియా?" అని యడిగెను. "అవును" అంటిని. "నేను ప్యాసుపోర్టు తనిఖీదారుడను" అనెను.

ఈ దేశములో రైలుప్రయాణము దీర్ఘమైనదైనను విసువు జనింపదు. మానవసౌకర్యమునకు వలయునవన్నియు ట్రెయినులో లభించును. అదియుగాక రైలుమార్గము పొడుగునను పాతబడిన వివిధములగు ఎడ్వర్టయిజుమెంటు బోర్డులును, ట్రెయినులోనికి చెకింగు నిమిత్తము వచ్చిపోవుచుండు టికెట్ సిబ్బందియొక్క ప్రత్యేకదుస్తులును, చాకొలేట్సు, ఐస్క్రీములు మొదలగు చిరుతిళ్ళు నమ్మువారి రీతులును, ఈ యమెరికన్ ప్రయాణికుల వైఖరులును, రైలుస్టేషనులలో వీడ్కోలొనర్చుకొను స్త్రీపురుష కరస్పర్శనములును ముద్దులును నా మార్గాయాసమును హరించి వైచెను.

నిన్న సాయంకాలము సూర్యాస్తమయము వేళకు ఫిలడల్ఫియా స్టేషన్ చేరుకొంటిని. స్టేషన్ చాల పెద్దది. నా చేతనున్న పోర్టుఫోలియోను "క్యాబు" వాడు మర్యాదగ లాగుకొనెను. "1928 నార్తు, 61 వ వీధి" యని యడ్రస్ నిచ్చితిని. క్యాబ్‌లో కూరుచుండి సంతోషముగ వీధులగుండబోయి, రాత్రివేళ, శ్రీమేరియా ఆశ్రమమునకు వచ్చితిని. మోటారు అగుటను కనుపెట్టి, రాల్ఫ్ఎంట్రికన్ సోదరుడు నన్ను ఆహ్వానించెను. ఆశ్రమమున పూజజరుగుచుండు నపుడుండు నిశ్శబ్దముండెను. ఎంట్రికన్ సోదరుడు నిశ్శబ్దముగ నాదరపూర్వకముగ నన్నాలింగన మొనర్చుకొనెను. హిందూమర్యాద నెరింగిన యీసోదరుని వదనము వికసితమై, మెల్లగను స్పష్టముగను నాతోమాటాడి, నాపేరెరింగి, "లోన, పవిత్రాత్ములగు ఓంకారస్వాములవారు భక్తులకు తత్త్వబోధ జేయుచున్నారు వారి సెలవుకు వేచి, మిమ్ము బహుకొలది నిమిషములలో లోనకు ప్రవేశపెట్టెదను" అనుచు వెళ్ళిపోయెను. ఒకటి రెండు నిముసములలో తిరిగివచ్చి, నన్ను తనవెంట లోనికి గొంపోయెను. రాజమండ్రిలో కక్కెరాల రామారావు దంపతులు ఇచ్చిన పరిచయపులేఖను స్వాములవారికొసంగి, నమస్కరించితిని. స్వామిజీ చిరునవ్వుతో నన్నుగ్రహించి, సభికురాండ్రకు ప్రత్యేకప్రత్యేకముగ నన్ను పరిచయ మొనరించెను. వారందరును హిందూపక్షపాతులు, వేదమతావలంబకులు, నన్ను ప్రేమపూర్వకముగ హిందూదేశమును గూర్చియు, నాప్రయాణ విశేషములను గూర్చియు, అమెరికాకు వచ్చుటలో నాయాశలను గూర్చియు అడుగుచుండిరి.

ఎంట్రికెన్ గారి సతీమణి ఓంకారస్వాములవారు 'మదర్' అని పిలిచెడివారు, నేనును ఆమెను 'మదర్' అని పిలుచుచుంటిని. ఆయె ప్రశాంత హృదయ, ఆమెది భక్తిపూరిత జీవితము. అమెరికనులకు గడు 'హరీబరీ' (హడావిడి) ఆమెయందుగానము. మాకు భోజనమిడిన వెనుక శబ్దరహితమగు నారాత్రివేళ ఆమె యొక్క యంగరకా నాపాదమస్తకమును ధరించి "మూర్తీ, నేనిప్పుడు హిమాలయమందలి హిందూయోగినివలె నున్నానా లేదా చూచిచెప్పుము" అనెను! అమెరికాకు చేరినవెనుక ఆరేయియంతటి శాంతియుత మగురేయిని నేను గడపియెరుగను.

ఫిలడల్ఫియా నగరము యునైటెడ్ స్టేట్సులో మూడవనగరము. దీనిజనాభా ఇరువది లక్షలు. పగలంతయు ట్రాఫిక్ వలన హోరుమని ధ్వని బయలుదేరుచుండును. ఫిలడల్ఫియా నగరము ప్రాముఖ్యత లేనిదికాదు. ఏలయన, బెన్జమిన్ ఫ్రాన్క్లిన్ మహాశయుడు గాలిపడగను ఎగుర వేయుచు విద్యుచ్ఛక్తియొక్క తత్వము నెరింగిన దీప్రదేశముననే; అమెరికాకు వలసబోయిన ఐరోపియనులు ఇచ్చటనుండియే, బ్రిటిషు సామ్రాజ్యాధిపతియగు మూడవజార్జితో సంబంధమును విడనాడిరి; ఫెడరల్ కేపిటల్ స్థాపనకు పూర్వము జార్జి వాషింగ్టన్ ప్రెసిడెంట్ వినిపించిన దిచ్చోటనే.

నాగరికతా చిహ్నంబులగు స్కూళ్ళు, కాలేజీలు, గ్రంధాలయములు, చిత్రవస్తు ప్రదర్శనశాలలు, చిత్రకళాభవనములు, వినోదప్రదేశములు, ఆటలు, ఉద్యానవనములు, విశ్రాంతిస్థలములు ఇవన్నియు నిటగలవు.

ఇచ్చట ముఖ్యముగ చూడదగినవాని నన్నిటిని నేనుచూచుటకు వ్యవధిలేకపోయెను. నగిషీతో నిండియున్న ఓల్డుఇండిపెండెన్సుహాల్ చూడదగినదే. డ్రెక్సెల్ ఇన్స్టిట్యూట్, జెరార్డుకాలేజీయు దర్శింపదగినవె. పెన్సిల్వేనియా విశ్వవిద్యాలయము గాంచదగినది. ఇందు సుమారు 20 స్కూళ్ళు, కాలేజీలుగలవు. అందు పగలుకష్టించి, తీరికలేమి, రాత్రి వచ్చి చదువు నభ్యసించువారి కొరకు ఏర్పడిన ఈవినింగ్ స్కూలును, స్కూలుకే వచ్చుటకు వీలులేని పరిస్థితు లేర్పడినవారికి పోస్టుద్వారా విద్యగరపు ఎక్స్టెన్షన్ స్కూలును గలవు. ఫిలడెల్ఫియాలో చూచితీరవలసిన కమర్షల్ మ్యూజియం ఉన్నది! యునైటెడ్ స్టేట్సు వస్తువులనుకొను ప్రతి పెద్ద విదేశవర్తకునకును ఇది తగిన సహాయములను చేయుచున్నది.

డేనియల్ గగ్గెన్హేమ్గారి దీనగరమే. ప్రపంచమునందు దొరకు రాగిలో సగమురాగి ఈ కోటీశ్వరునిదె. లోకమందలి పెద్ద రాగిగనులలో మూడు ఈయనవె, వీరికి రాగియేగాక తగరము, రజితము కనకముల పరిశ్రమలు గలవు. గగ్గెన్హేమ్గారి పనిలోనున్న యుద్యోగులు చాల యెక్కువ జీతములను సంపాదించుకొనుచుందురు. ఒకరికి పదిలక్షలడాలర్లట సాలుకు! పదిలక్షల డాలరులనగ దరిదాపు 30 లక్షల రూపాయిలు!